శ్రీ

# కుమారశతకము.

ఉభయభాషాప్రవీణ

భాగవతుల దక్షిణామూర్తిశాస్త్రి

విరచిత టీకాతాత్పర్య సహితము.

వల్లి [illegible]

యం. యస్. శర్మ అండ కొం.

గుంటూరు - తెనాలి.

1933.



[వె 0—2—6.



శుభమస్తు.

శ్రీహయగ్రీవాయ నమః.

# కుమారశతకము

క॥ శ్రీభామినీమనోహరు
సౌభాగ్య దయాస్వభావు • సారసనాభుఁ
లో భావించెద నీకుఁ
వైభవము లొసంగుచుండ • వసుధ కుమారా. ౧.

టీక:—కుమారా! = బాలుఁడా! (ఇట్లే ప్రతిపద్యమునకు మొదటను జూచుకొనునది.) నీకుఁ = నీకు; వసుధఁ = భూమియందు; వైభవము లొసంగుచుండఁ = సంపదల నిచ్చునట్లుగా; సౌభాగ్యుఁ = భాగ్యవంతుఁడైన; దయాస్వభావుఁ = కరుణ గలిగినట్టియు; సారసనాభుఁ = పద్మము బొడ్డునందు గల్గిన; శ్రీభామినీమనోహరుఁ = లక్ష్మీదేవికి భర్తయైన శ్రీమహావిష్ణువును; లో భావించెదఁ = మనస్సులో ధ్యానించెదను.

తా:—ఓ బాలుఁడా! నీకు అన్ని సౌఖ్యములను పరమేశ్వరుఁడైన శ్రీమహావిష్ణువు అనుగ్రహించునట్లు ప్రార్థించుచున్నాను. పరమేశ్వరుని ప్రార్థించిన అన్ని కోరికలు సిద్ధించునుగదా!

క॥ ఆజ్ఞ యొనర్చెడి వృత్తుల
లో జ్ఞానము గలిగి మెలఁగు • లోకులు మెచ్చన్
బ్రాజ్ఞతను గలిగియున్నన్
బ్రాజ్ఞులలోఁ బ్రాజ్ఞుఁ డౌదు • ప్రబలి కుమారా. ౨

టీ:— ఆజ్ఞయొనర్చెడి = నీ ఆనతిప్రకారము పనిచేయు; వృత్తులలోన్ = మనస్సుయొక్క వ్యాపారములయందు; జ్ఞానము గలిగి = తెలివితో; మెలఁగు = ప్రవర్తింపుము; ప్రాజ్ఞతను గలిగియున్నన్ = తెలివి గలిగి యున్నచో; ప్రాజ్ఞులలోన్ = పండితులలో; ప్రాజ్ఞుఁడౌదు = పండితుఁడ వగుదువు.

తా॥ నీ మనస్సును నీవు చెప్పినట్లు నడిపించుచు వివేకము గలిగి యున్నచో లోకులు నిన్ను కొనియాడెదరు. పండితులు గూడ నిన్ను గొప్పగ జూతురు.

క॥ అతి బాల్యములో నైనను
బ్రతికూలపుమార్గములఁ బ్ర•వర్తింపక స
ద్గతి మీఱ మెలఁగ నేర్చిన
నతనికి లోకమున సౌఖ్య•మగును కుమారా. 3

టీ:—అతిబాల్యములోనైనను = మిక్కిలి చిన్నతనమందుఁ గూడ; ప్రతికూలపు మార్గములన్ = చెడుత్రోవలందు; ప్రవర్తింపక = నడుగక; సద్గతి మీఱ మెలఁగనేర్చిన = మంచిమార్గమున నడుగనేర్చినచో; అతనికి; లోకమున = ప్రపంచమున; సౌఖ్యమగును = సుఖము చేకూరును.

తా:—ఏమియు తెలియని చిన్నవయస్సునందు గూడ చెడుపనుల చేయకుండ మంచితనమునే యలవాటు పఱచుకొనినచో ముందు మంచి సౌఖ్యము వచ్చును.

క॥ వృద్ధజనసేవఁ జేసిన
బుద్ధివిశేషజ్ఞుఁ డనుచుఁ బూతచరిత్రుఁడున్
సద్ధర్మశాలియని బుధు
లిద్ధరఁ బొగడెదరు ప్రేమ నెసఁగ కుమారా. 8

టీ:— వృద్ధజనసేవఁ జేసిన = పెద్దలను సేవించినచో: బుద్ధివిశేషజ్ఞుఁ డనుచు = చాల తెలిసినవాఁ డనియు; పూతచరిత్రుఁడున్ = పవిత్రమైన నడవడికలవాఁడనియు; సద్ధర్మశాలియని = మంచి ధర్మబుద్ధి గలవాఁ డనియు; బుధులు = పండితులు; ఇద్ధరన్ = ఈప్రపంచమున; ప్రేమ యెసఁగ, = దయతో; పొగడెదరు.

తా:— పెద్దల కుపచారములు చేసి వారి కోరికలను నెరవేర్చినచో నీవంటి తెలివిగలవాఁడు, నీతిగల నడవడికలవాఁడు, ధర్మాత్ముఁడు లేఁడని తెలిసికొనుము.

క॥ పెద్దలు వద్దని చెప్పిన
పద్దులఁ బోవంగరాదు పరకాంతల సే
పొద్దే నెదఁ బరికించుట
కుద్దేశింపంగఁ గూడ దుర్వి కుమారా.

టీ:— పెద్దలు = తండ్రి మొదలగువారు; చెప్పిన; పద్దులన్ = పంతములకు; పోవంగరాదు = పోఁగూడదు; పరకాంతలన్ = తనభార్య తప్ప ఇతరస్త్రీలనుగూర్చి; ఏపొద్దేన్ = ఎప్పుడును; ఎదన్ = మనస్సులో: పరికించుటకున్ = ఆలోచించుటకును; ఉద్దేశింపంగఁ గూడదు = తలపను గూడదు.

తా:— ఎప్పుడును పంతములు గట్టి చెడుతోవలఁ బోకుము. తన భార్యను తప్ప ఇతరస్త్రీలను మనస్సునందైనను తలంపఁ గూడదు.

క॥ ఆజ్ఞ యొనర్చెడి వృత్తుల
లో జ్ఞానము గలిగి మెలఁగు • లోకులు మెచ్చన్
బ్రాజ్ఞతను గలిగియున్నన్
బ్రాజ్ఞులలోఁ బ్రాజ్ఞుఁ డౌదు • ప్రబలి కుమారా. ౨

టీ:— ఆజ్ఞయొనర్చెడి = నీ ఆనతిప్రకారము పనిచేయు; వృత్తులలోన్ = మనస్సుయొక్క వ్యాపారములయందు; జ్ఞానము గలిగి = తెలివితో; మెలఁగు = ప్రవర్తింపుము; ప్రాజ్ఞతను గలిగియున్నన్ = తెలివి గలిగి యున్నచో; ప్రాజ్ఞులలోన్ = పండితులలో; ప్రాజ్ఞుఁడౌదు = పండితుఁడ వగుదువు.

తా॥ నీ మనస్సును నీవు చెప్పినట్లు నడిపించుచు వివేకము గలిగి యున్నచో లోకులు నిన్ను కొనియాడెదరు. పండితులు గూడ నిన్ను గొప్పగ జూతురు.

క॥ అతి బాల్యములో నైనను
బ్రతికూలపుమార్గములఁ బ్ర•వర్తింపక స
ద్గతి మీర మెలఁగ నేర్చిన
నతనికి లోకమున సౌఖ్య•మగును కుమారా. 3

టీ:—అతిబాల్యములోనైనను = మిక్కిలి చిన్నతనమందుఁ గూడ; ప్రతికూలపు మార్గములన్ = చెడుత్రోవలందు; ప్రవర్తింపక = తిరుగక; సద్గతి మీర మెలఁగ నేర్చిన = మంచిమార్గమున తిరుగ నేర్చినచో; అతనికి; లోకమున = ప్రపంచమున; సౌఖ్యమగును = సుఖము చేకూరును.

తా:—ఏమియు తెలియని చిన్నవయస్సునందు గూడ చెడుపనుల చేయకుండ మంచితనముసే యలవాటు పఱచుకొనినచో ముందు మంచి సౌఖ్యము వచ్చును.

క॥ వృద్ధజన సేవఁ జేసిన
బుద్ధివిశేషజ్ఞుఁ డనుచుఁ • బూతచరిత్రుఁడున్
సద్ధర్మశాలియని బుధు
లిద్ధరఁ బొగడెదరు ప్రేమ • యొసఁగ కుమారా. ౭

టీ:—వృద్ధజనసేవఁ జేసిన = పెద్దలను సేవించినచో: బుద్ధివిశేషజ్ఞుఁ డనుచు = చాల తెలిసినవాఁ డనియు; పూతచరిత్రుఁడున్ = పవిత్రమైన నడవడిగలవాఁడనియు; సద్ధర్మశాలియని = మంచి ధర్మబుద్ధి గలవాఁ డనియు; బుధులు = పండితులు; ఇద్ధరన్ = ఈప్రపంచమున; ప్రేమ యొసఁగ,=దయతో; పొగడెదరు.

తా:—పెద్దల కుపచారములు చేసి వారి కోరికలను నెరవేర్చినచో నీవంటి తెలివిగలవాఁడు, నీతిగల నడవడిగలవాఁడు, ధర్మాత్ముఁడు లేఁడని తెలిసికొనుము.

క॥ పెద్దలు వద్దని చెప్పిన
పద్దులఁ బోవంగరాదు • పరకాంతల నే
ప్రొద్దే నెదఁ బరికించుట
కుద్దేశింపంగఁ గూడ • దుర్వి కుమారా.

టీ:—పెద్దలు = తండ్రి మొదలగువారు; చెప్పిన; పద్దులన్ =పంతములకు; పోవంగరాదు = పోఁగూడదు; పరకాంతలన్ = తనభార్య తప్ప ఇతరస్త్రీలనుగూర్చి; ఏప్రొద్దేన్ = ఎప్పుడును; ఎదన్ = మనస్సులో; పరికించుటకున్ = ఆలోచించుటకును; ఉద్దేశింపంగఁ గూడదు = తలపను గూడదు.

తా:—ఎప్పుడును పంతములు గట్టి చెడుత్రోవలఁ బోకుము. తన భార్యను తప్ప ఇతరస్త్రీలను మనస్సునందైనను తలంపఁ గూడదు.

క॥ తనపైఁ దయ నూల్కొనఁ గనుఁ
గొన నేతెంచిన సుశీల • గురుమతులను వం
దనముగఁ బూజింపందగు
మన మలరఁగ నిదియ విబుధ•మతము కుమారా. ౬

టీ:—తనపైన్ = తనమీఁద; దయ నూల్కొనన్ = ప్రేమతో; కనుఁగొనన్ = చూచుటకు; ఏతెంచిన = వచ్చిన; సుశీలగురుమతులను = మంచిస్వభావముగల గొప్పవారిని; వందనముగ = నమస్కారముతో; మనము = ఆ పెద్దలమనస్సు; అలరగన్ = సంతోషించునట్లు; పూజింపందగును; ఇదియ = ఇదియే; విబుధమతము = పెద్దలకు సమ్మతము.

తా:—నీక్షేమమును గోరి నీయందు ప్రేమను జూపు పెద్దలు వచ్చినపుడు వారు సంతోషించునట్లు నమస్కరింపుము. ఇంతకంటె పెద్దలకిష్టమైనది యింకొకటి లేదు.

క॥ ఉన్నను లేకున్నను పై
కెన్నఁడు మర్మంబు తెలుప • నేగకుమీ నీ
కన్నతలిదండ్రుల యశం
బెన్నఁబడెడు మాడ్కిఁ దిరుగు•మీవు కుమారా. ౭

టీ:—ఉన్నను = నీకు ధన మున్నను; లేకున్నను = లేకపోయినప్పటికి; ఎన్నఁడు = ఎప్పుడుగూడ; మర్మంబు = నీరహస్యమును; తెలుపన్ = ఇతరులకు చెప్పుటకు; ఏగకుము = వెళ్లకుము; కన్నతల్లిదండ్రుల = నిన్ను కనిన తల్లిదండ్రులయొక్క; యశంబు = కీర్తి; ఎన్నఁబడెడుమాడ్కిన్ = కొనయాడఁదగిన రీతిని; ఈవు=నీవు; తిరుగుము = ప్రవర్తింపుము.

తా:—తినుట కున్నను లేకపోయినను నీసంగతి నితరులకు తెలియనీయకుము. అట్లు సిగ్గువిడిచి బయలుపెట్టినచో నిన్ను చూచి సంతోషించుటకు తలపెట్టిన నీతల్లిదండ్రులకీర్తి నాశనము జెందును.

క॥ పెద్దలు విచ్చేసినచో
బద్దకమున నైన దుష్టపద్ధతినైనన్
హద్దెరిగి లేవకున్నను
మొద్దువలెం జూతు రతని ముద్దుకుమారా. ౮

టీ:—పెద్దలు=పూజ్యులు; విచ్చేసినచోన్ = వచ్చినపుడు; బద్దకమున నైనన్ = సోమరితనముచేగాని; దుష్టపద్ధతినైనన్ = దుర్మార్గపు నడవడిచేగాని; హద్దెరిగి = సమీపమున నున్నారని తెలిసికొని; లేవకున్నను = లేచి గౌరవింపనిచో; అతనిని; మొద్దువలెం జూతురు = పశువునుగా తలంతురు.

తా:—నీవు పూజింపందగినవారు వచ్చినపుడు సోమరితనముచేగాని గౌరవము లేకగాని వారిని పూజింపనిచో నీకును జ్ఞానము లేని పశువునకును భేద మేమి కలదు?

క॥ సతతము ప్రాతఃకాలో
చితవిధులను జరుపు మరసి శీఘ్రముగ నహ
ర్పతి పూర్వపర్వతాగ్రా
గతుఁ డగుటకు మున్నె వెరపు గల్గి కుమారా. ౯

టీ:—అహర్పతి = సూర్యుఁడు; పూర్వ....గతుఁడగుటకు—పూర్వపర్వత = తూర్పుదిక్కుననున్న ఉదయ పర్వతముయొక్క; అగ్రగతుఁడగుటకుమున్నె = శిఖరము పొందుటకు పూర్వమే; వెరపుగల్గి = భయముగల్గినవాఁడవై; సతతము = ఎల్లప్పుడు; ప్రాతఃకాలోచితవిధులను = ప్రొద్దున చేయఁదగిన జపము మొదలగు కార్యములను; శీఘ్రముగన్ = వెంటనే; అరసి=ఆలోచించి; జరుపుము = చేయుము.

తా:—ప్రతిదినము సూర్యుఁడు తూర్పుదిక్కున నుదయింపకమునుపే లేచి స్నానము సంధ్య మొదలగు నిత్యకృత్యములను చేయుము. అట్లు చేయనిచో పరమేశ్వరుఁడు నిన్ను దండించును.

క॥ పోషకునిమతముఁ గనుఁగొని
భూషింపక కాని ముదము ♦ బొందఁడు మఱియున్
దోషముల నెంచుచుండును
దోషివయిన మిగుల కీడు ♦ దోచు కుమారా. ౧౦

టీ:—పోషకుని = స్వామియొక్క; మతము గనుగొని = ఇష్టమును తెలిసికొని: భూషింపక కాని = పొగడనియెడల; ముదముఁబొందఁడు = సంతోషింపఁడు: మఱియున్ = అట్లు కానిచో; దోషముల నెంచుచుండును = నీతప్పులను వెదకుచుండును. దోషివయినన్ = తప్పుచేసినవాఁడవైనచో: మిగులకీడు దోచున్ = మిక్కిలి ఆపద సంభవించును.

తా:—నిన్ను పోషించు స్వామి మనస్సును గనిపెట్టి పొగడుచుండవలెను. అట్లు కానిచో నెల్లపుడు నీతప్పులనే చూచుచు నిన్ను దయతో జూడఁడు. ఒకతూరి తప్పుచేసినవాఁడవైన ముందు నీకు సౌఖ్యము వచ్చుట సందేహము.

క॥ నరవరుఁడు నమ్మి తను నౌ
కరిలో నుంచు నెడ వాని ♦ కార్యములందున్
సరిగా మెలంగ నేర్చిన
పురుషుఁడు లోకమునఁ గీర్తిఁ ♦ బొందు కుమారా. ౧౧

టీ:—నరవరుఁడు = రాజు; తను నమ్మి = తనయందు నమ్మక ముంచి; నౌకరిలో నుంచు నెడన్ = ఉద్యోగ మిచ్చినపుడు; వాని కార్యములందున్ = రాజుపనులందు; సరిగా మెలంగ నేర్చిన పురుషుఁడు = తగు రీతిని ప్రవర్తించువాఁడు; లోకమున కీర్తినిబొందును.

తా:—తన్ను నమ్మి తన కుద్యోగ మిచ్చి ప్రేమించు రాజును మోస పుచ్చగూడదు. అతని కార్యములను చక్కబరుపవలెను. మోసము చేసినచో అపకీర్తివచ్చును.

క॥ పుడమిని దుష్టత గలయా
తఁడు లంచంబులను బట్టఁ దలఁచును; మిడియా
నడవడిఁ మిడి యందరి వెం
బడిఁ ద్రిప్పికొనుచును గీడుఁ బరుప కుమారా. ౧౨

టీ:—పుడమిని = భూమియందు; దుష్టతగల యాతఁడు = దుర్మార్గము గలవాఁడు; లంచంబులను బట్టదలఁచును = అన్యాయముగ ధనమును సంపాదింప నేర్చును; మిడియా నడవడి = మిడిసిపాటుగల స్వభావము గలవాఁడు; మిడి = ఆమిడిసిపాటుతనమును; అందరి వెంబడి ద్రిప్పికొనుచును — జను లందరిమీదను ప్రయోగించుచు; కీడుపరుపఁగ = అపకారము చేయఁ యత్నించును.

తా:—లంచంబులను బట్టు అధికారి దుర్మార్గుఁడు. అదరిపాటు గలిగినవాఁడై, పరులను క్రూరముగ జూచి హింసించును.

క॥ పను లెన్ని కలిగియున్నను
దినదినమున విద్య పెంపు ధీయుక్తుఁడవై;
వినఁగోరుము సత్కథలను
కని విబుధులు సంతసించుఁ గతిని కుమారా. ౧౩

టీ:—ఎన్ని పనులు గలిగియున్నను. దినదినమునఁ = ప్రతిదినము; ధీయుక్తుఁడవై = బుద్ధితో గూడుకొనిన వాఁడవై; విబుధులు = పండితులు; కని = చూచి; సంతసించుగతిని = సంతోషించునట్లు; విద్య = చదువును; పెంపు = వృద్ధిచేయుము: సత్కథలను = మంచివారి చరిత్రలను; వినగోరుము.

తా:—అవసరమైన పను లెన్ని యున్నను ప్రతిదినమును విద్యను జ్ఞానమును ముఖ్యముగ సంపాదించుచుండుము. సత్పురుషులకథలను వినుము. దానిచే నిన్ను చూచి పెద్దలు సంతోషించుదురు.

క॥ ధరణీనాయకు రాణియు,
గురురాణియు, నన్నరాణి, ♦ కులకాంతను గ
న్న రమణిఁ, దను గన్నదియును
ధర నేవురు తల్లు లనుచుఁ ♦ దలఁపు కుమారా. ౧౪

టీ:—ధరణీ నాయకు రాణియున్ = రాజుభార్యయు; గురురాణియున్ = గురుని భార్యయు; అన్నరాణి = వదినగారును; కులకాంతను గన్నరమణి = భార్యయొక్క తల్లి (అత్త) యు; తను గన్నది = తన తల్లియు; ఏవురు—ఈ ఐదుగురు; తల్లులనుచు=తల్లులనుగా; తలపు=తలంచుము.

తా:—తన్ను గన్నతల్లి యొకతియే తల్లి గాదు. రాజుభార్య, గురువు భార్య, వదిన, అత్తగారు వీరుగూడ నీకు తల్లు లనియే తలంచుచుండుము.

క॥ సదమలమతితో పెద్దలు
మది కింపుగ మెలఁగు నింద ♦ మానుము పరులన్
మృదుమార్గములను వదలకు
విదితంబుగ దానఁ గీర్తి ♦ వెలయు కుమారా.

టీ:—సదమలమతితోన్ = మంచి స్వచ్ఛమైన మనస్సుతో; పెద్దలయొక్క; మదికిన్ = మనస్సునకు; ఇంపుగన్ = ఆనందముగ; మెలఁగు = ప్రవర్తింపుము; పరులన్ = ఇతరులను; నిందమానుము = దుర్భాషలాడకుము; మృదుమార్గములను = చక్కని త్రోవలను; వదలకుము; దానన్ = దానిచే; విదితంబుగన్=అందఱికి తెలియునట్లు; కీర్తివెలయున్ = కీర్తివృద్ధి పొందును.

తా:—మంచి నడవడి గలిగి పెద్దల నానందింపఁ జేయుము. ఎవ్వరిని ఎప్పుడు దూరకుము. మంచి యలవాట్లను మానకుము. దానిచే అందరు నిన్ను మంచివాఁడ వందురు.

క॥ ఆచార్యున కెదిరింపకు
ప్రోచినదొర నిందసేయఁ • బోకుము కార్యా
లోచనము లొందఁజేయకు
మాచారము విడువఁబోకు • మయ్య కుమారా. ౧౬

టీ:—ఆచార్యునకున్ = గురువునకు; ఎదిరింపకు = ఎదురుమాట చెప్పకుము; ప్రోచిన = రక్షించిన; దొరన్ = స్వామిని; నిందసేయఁబోకుము = చెడుమాట లాడకుము; కార్యాలోచనములు = తప్పక చేయదగిన పనుల విషయమై చేయుదమా వద్దాయని సందేహములను; ఒందఁజేయకుము = చేరనీయకుము; ఆచారము = మంచినడవడిని; విడువఁబోకుము.

తా:—ఉపాధ్యాయుఁడు చెప్పినట్లు చేయుము. నీస్వామిని ప్రేమించుము. మంచిపనులు, తప్పక చేయఁదగినవానిని, శీఘ్రముగ చేయుము. మంచినడవడి విడువకుము.

క॥ పుట్టినది మొదలు పరసతిఁ
బట్టగఁజూచుటయె నింద్య • పద్ధతి యనుచు
న్నట్టిపురుషుండు పుడమిం
బుట్టిన జనతతులఁ గీర్తి • బొందు కుమారా. ౧౭

తా:—పరసతిన్ = ఇతరస్త్రీని; పట్టగఁజూచుటయె = చెఱబట్టుట కాలోచించుటయే; నింద్యపద్ధతి యనుచున్ = తప్పుపనియని; పుట్టినది మొదలు = చిన్నతనమునుండియు; (తలఁచు) పురుషుండు = జనుఁడు; పుడమిం బుట్టినన్ = భూమియందు పుట్టినచో; జనతతులన్ = జను లందఱిలో; కీర్తిని బొందును.

తా:—బాల్యమునుండియును బరస్త్రీలను మనంబునఁ దలఁచుటయే దోషమని యెంచువాఁడు కీర్తిసంపన్నుఁ డగును.

క॥ కల్ల లగుమాట లాడక
యెల్లజనంబులకు వేగ ♦ హృదయము గడు రం
జిల్లఁగఁ బల్కుము నీ కది
తెల్లమి రహిఁ కీర్తిగాంచు♦ తెఱఁగు కుమారా. ౧౮

టీ:—కల్లలగు = అబద్ధములైన మాటలు; ఆడక = పలుకక; ఎల్ల జనంబులకున్ = అందఱికి; వేగ = వెంటనే; హృదయము = మనస్సు; రంజిల్లగన్ = సంతోషించునట్లు; పలుకుము. అది = ఆమార్గము; నీకు; తెల్లమి = స్వచ్ఛమైన; కీర్తిని; రహిన్ = ఆనందముతో; కాంచు = పొందు; తెఱఁగు = మార్గము.

తా:—అబద్ధము లెప్పుడును ఆడకుము. అందరి మనస్సు సంతోషించునట్లు మాట్లాడుము. సుఖముగా కీర్తి నీకు వచ్చును.

క॥ ఏనాఁడైనను వినయము
మానకుమీ మత్సరమున ♦ మనుజేశులతోఁ
బూనకు మసమ్మతము బహు
మానమ్మును బొందు మిదియె♦మతము కుమారా. ౧౯

టీ:—ఏనాఁడైనను = ఎప్పుడైనను; వినయము = నీతిని; మానకుమీ = విడువవలదు; మనుజేశులతోన్ = ప్రభువులతో; మత్సరమునన్ = ద్వేషమున అసమ్మతము = అంగీకరింపకుండుటను; పూనకుము = చేయకుము; బహుమానమ్మును = గౌరవమును; పొందుము; ఇదియే; మతము = అందరికి ఇష్టమైనది.

తా:—ఎప్పుడు నీతిని వదలకుము. రాజులమీఁద పగఁబూని వారి కెదురు చెప్పకుము. వారిచే గౌరవమును పొందుము. ఇంతకన్న మంచిమార్గము లేదు.

క॥ సగఁగూడదు పరసతిఁ గనఁ
దగ మాతృసమాన మెన్నఁ దగు నెవ్వరితో
బగ గూడ దొరుల నిందిం
పఁగఁగూడదు కనుము వృద్ధపథము కుమారా. ౨౦

టీ:—పరసతిఁగనన్ = ఇతర స్త్రీని చూచి; నగఁగూడదు = నవ్వ గూడదు; తగన్ = తగునట్లు; మాతృసమానము = తల్లినివలె; ఎన్నఁ దగున్ = తలఁపదగును: ఎవ్వరితోను; పగకూడదు = వైరము పనికి రాదు; ఒరులన్ = ఇతరులను; నిందింపగగూడదు = తిట్టగూడదు; వృద్ధ పథము = పెద్దల మార్గమును; కనుము = తెలిసికొనుము.

తా:—పర స్త్రీని చూచి నవ్వుట పెద్దతప్పు. ఆమెగూడ నీ తల్లి యని తలచుము. ఎవ్వరితోను విరోధింపకుము. ఎవ్వరిని నిందింపకుము. ఇది పెద్దలు ఆచరించిన విధము.

క॥ చేయకుము కాని కార్యముఁ
బాయకు మెన్నఁడు శుభం బవని భోజనమున్
జేయకుము రిపుగృహంబునఁ
గూయకు మొరుమనసు నొచ్చుకూత కుమారా. ౨౧

.—కానికార్యము = చెడ్డపనిని చేయకుము; శుభంబు = మంచి పనిని: పాయకుము = వదలకుము; రిపుగృహంబునన్ = శత్రువునియింట; భోజనమును జేయకుము; ఒరుమనసు = ఇతరుని మనస్సు: నొచ్చుకూత = కష్టపడు మాటను; కూయకుము = పలుకకుము.

తా:—చెడ్డపనులను వదలుము: మంచికార్యములను వదలకుము. గిట్టనివారింట భుజింపకుము. ఇతరులకు నొప్పి కలుగునట్లు మాట్లాడకుము.

క॥ పిన్నలపెద్దలయెడఁ గడు
మన్ననచే మెలఁగు సుజన♦మార్గంబుల నీ
వెన్నికొని తిరుగుచుండిన
నన్నియెడల నెన్నఁబడుదు ♦ వన్న కుమారా. ౧౨

టీ:—పిన్నల పెద్దలయెడన్ = నీకంటె చిన్నవారియందు, పెద్దవారియందు; కడు మన్ననచేన్ = మిక్కిలి గౌరవముతో; మెలఁగుము; నీవు; సుజనమార్గంబులన్ = మంచివారి పద్ధతులను; ఎన్నికొని = స్వీకరించి; తిరుగుచుండినన్ = ప్రవర్తించినచో; అన్నియెడలన్ = అన్నిచోట్ల; ఎన్నబడుదువు = పొగడబడుదువు.

తా:—చిన్నవారిని ప్రేమించుము. పెద్దలను గౌరవించుము. మంచి మార్గమున ప్రవర్తించుము. అందరు నిన్ను కీర్తింతురు.

క॥ తనకును విద్యాభ్యాసం
బును జేసినవానికన్నఁ ♦ బొలుపుగఁ బది రె
ట్లను దూఁగు తండ్రి; వానికి
జననియుఁ బదిరెట్లు తూఁగు ♦జగతి కుమారా. ౧౩

టీ:—తనకును; విద్యాభ్యాసంబుజేసిన వానికన్న=చదువు చెప్పిన వానికన్న(ఉపాధ్యాయునికంటె;)తండ్రి;పొలుపుగన్=అందముగ;పదిరెట్లను తూగున్=పదిపాళ్లు ఎక్కువ యైనవాఁడు; వానికిన్ = ఆ తండ్రికంటెను; జననియు = తల్లి; పదిరెట్లు తూగున్ = పదిరెట్లధికమగును.

తా:—చదువుచెప్పిన గురువుకన్న తండ్రి పదిరెట్లు గౌరవింపదగినవాఁడు, ఆ తండ్రికంటె తల్లి మఱల పదిరెట్లు ప్రేమింపఁ దగినది.

క॥ తమ్ములు తమయన్నయెడ భ
యమ్మును భక్తియును గలిగి • యారాధింపన్,
దమ్ముల నన్నయు సమ్మో
దమ్మునఁ బ్రేమింపఁ, గీర్తి • దనరు కుమారా. ౨౭

టీ:—తమ్ములు = సోదరులు; తమయన్నయెడన్ = తమఅన్నగారియందు; భయమ్మును భక్తియును గలిగి = భయభక్తులు గలిగి; ఆరాధింపన్ = సేవింపగా; తమ్ముల నన్నయు = సోదరులను అన్నయు; సమ్మోదమ్మునన్ = మిక్కిలి సంతోషముతో; ప్రేమింపన్ = ప్రేమ చూపిన యెడల; కీర్తి; తనరున్ = చేకూరును.

తా:—అన్నగారియెడల తమ్ములు భయభక్తులతో మెలఁగునప్పుడు అన్న వారియెడల మోసమును జూపక వారిని ప్రేమించినచో కీర్తిగలవాఁడగును.

క॥ అప్పం దనతల్లిగ మే
లొప్పం గని జరుపవలయు • నుర్విస్థలిఁ జి
న్నప్పుడు చన్నిడి మనిపిన
యప్పడఁతియు మాతృతుల్య•యండ్రు కుమారా. ౨౮

టీ:—అప్పన్ = అక్కగారిని; కని = చూచి; తల్లిగన్ = తల్లివలె; మేలొప్పన్ = ఉపకార మగునట్లుగా; జరుపవలెన్ = గౌరవించవలెను; ఉర్విస్థలిన్ = భూమియందు: చిన్నప్పుడు = చిన్నతనమున; చన్నిడి = చనుబాల నిచ్చి; మనిపిన = పోషించిన; అప్పడతియు = ఆమెయును; మాతృతుల్య యండ్రు = తల్లితో సమానయని పెద్దలు చెప్పుదురు.

తా:—తనకన్న పెద్దదియగు అక్కగారియందుగూడ తల్లియందువలెనే ప్రేమ గలిగియుండుము. నీ చిన్నతనమున నీకు జనుబాల నిచ్చి నిన్ను కాపాడినయాపె నీకు తల్లితోసమానము.

క॥ బూటకపువర్తనము గని
జూటరి వీఁడనుచుఁ దప్పు♦జూతురుగా యా
బొటను విడి సత్యము మది
నాటించి నటించువాఁడె ♦ నరుఁడు కుమారా. ౨౬

టీ:—బూటకపు వర్తనమున్ = మోసపు ప్రవర్తనను; కని=చూచి; వీఁడు = ఈజనుఁడు; జూటరి= నీచుఁడు; అనుచున్; తప్పజూతురుగా = చెడ్డగా తలచెదరుగదా; ఆబొటను = ఆమోసపు త్రోవను; విడి = వదలి; మదిన్ = మనస్సులో; సత్యము = నిజమును; నాటించి=చేర్చి; నటించువాఁడె = ప్రవర్తించు నతఁడే; నరుఁడు = మనుష్యుఁడు.

తా:—తప్పులను జేయువానిని లోకులు నీచునిగా దలంతురు. సత్యము నే పలుకవలెనని నియమమును స్వీకరించినవాఁడే మనుష్యుఁడు. లేక పోయిన పశువనియే చెప్పవలెను.

క॥ తనయుఁడు చెడుగై యుండిన
జనకునితప్పన్నమాట ♦ సత్యమ యగుఁగా
వున నీజననీజనకుల
కు నపఖ్యాతి యగురీతిఁ ♦ గొనకు కుమారా. ౨౭

టీ:—తనయుఁడు = కుమారుఁడు; చెడుగై యుండినన్ = చెడ్డవాఁడై యున్నచో; జనకుని తప్పు = తండ్రియొక్క లోపము; అన్నమాట = అనుపలుకు; సత్యము + అ = నిజమే; అగుఁగావునన్ = అగును కాఁబట్టి; నీ జననీజనకులకున్ = నీ తల్లి తండ్రులకు; అపఖ్యాతియగు = అపకీర్తియగు; రీతిన్ = విధముగా; కొనకు = ప్రవర్తింపకుము.

తా:—కుమారుఁడు తప్పు చేసినచో తండ్రి కట్టుదిట్టముగ పెంచ లేదని తండ్రికి నపకీర్తి వచ్చును. నీ తల్లిదండ్రుల కీర్తిని కాపాడుట కుమారుఁడవైన నీకు అవసరము. కాన చెడుపనులను జేయకుము.

క॥ తల్లిని దండ్రిని సహజుల
నల్లరిబెట్టినను వార ♦ లలుగుచు నీపై
నుల్లముల రోయుచుందురు
కల్లరి వీఁ డనుచు కీర్తి ♦ గంద కుమారా. ౧౮

టీ:—తల్లిని తండ్రిని; సహజులన్ = తోడఁబుట్టినవారిని; అల్లరిబెట్టినను = నిందించినచో; నీపై; వీఁడు; కల్లరియని = అబద్ధము లాడువాఁడని; కీర్తికందన్ = నీకీర్తికి భంగము గలుగునట్లు; ఉల్లములన్ = మనస్సులలో; రోయుచుందురు = విసుగుకొనుచుందురు.

తా:—తల్లిదండ్రులను దోఁబుట్టువులనుగూర్చి పరులతో నిందలుపలికినచో వారు నిన్నుఁగూర్చి మనస్సులలో క్షోభ జెందుదురు. అట్లెన్నడును జేయకుము.

క॥ లోకులు తను గొనియాడ వి
వేకి యదియు నిందరీతి ♦ విన నొల్లఁడు; సు
శ్లోకులచరితం బిట్టిది;
చేకొనవలె నట్టినడక ♦ చిన్నికుమారా. ౧౯

టీ:—వివేకి = తెలివిగలవాఁడు; లోకులు = జనులు; తను గొనియాడన్ = తనను పొగడగానే; అదియున్ = ఆపొగడఁగూడ; నిందరీతిన్ = తిట్టుటవలె; విననొల్లఁడు = వినుట కిష్టపడఁడు; ఇట్టిది = ఇటువంటిది; సుశ్లోకుల = మంచివారి; చరితము = ఆచరణము; అట్టినడకను; చేకొనవలెన్ = ఆచరింపవలెను.

తా:—లోకులు తనను పొగడినప్పుడు సంతోషింపక తిట్టినపుడువలె తలఁచువాఁడు పుణ్యాత్ముఁడు. అటులనే నీవుగూడ నాచరింపుము.

క॥ ధరణిని బరోపకారా
చరణవ్రతనిష్ఠ నెపుడు • సలుపుము నీ కా
తెరఁ గుపవాసాదివ్రత
వరకర్మముకన్న మేలు • వచ్చు కుమారా. 30

టీ:—ధరణిని = లోకమున; పరోపకారా......నిష్ఠన్—పరోప కార = ఇతరుల కుపకారమును; ఆచరణ = చేయుటయనెడి; వ్రతనిష్ఠన్= నియమమును; ఎపుడు = ఎప్పుడును; సలుపుము, = చేయుము; నీకు; ఆ తెరగు = ఆపద్ధతి; ఉపవాసాది......కర్మము — ఉపవాసాది = ఉపవాసము మొదలుగాగల; వ్రత = నియమముల వంటి; వర = శ్రేష్ఠమైన; కర్మము కన్నన్ = ధర్మముల కంటెను; మేలు = మంచి; వచ్చును.

తా:—ఉపవాసమునుచేసి పుణ్యమును సంపాదించుటకంటె పరోప కారమును చేసినచో నంతకన్న నెక్కువ పుణ్యమును సులభముగ పొంద వచ్చును.

క॥ వగవకు గడచినదానికిఁ
బొగడకు దుర్మతుల నెపుడు • పొసగనిపనికై
యొగి దీనత నొందకుమీ
తగ దైవగతిం బొసంగు • ధరను కుమారా. 31

టీ:—గడచినదానికిన్ = జరిగిపోయిన పనినిగూర్చి; వగవకు = దుఃఖింపకుము; ఎపుడును, దుర్మతులన్ = దుర్మార్గులను; పొగడకు = కీర్తింపకుము; పొసఁగనిపనికై = పనికిరాని పనికొఱకు; దీనతన్ = దైన్యముతో: ఒదెదకుము = పోకుము; దైవగతిన్ = అదృష్టముయొక్కతోవ వను; తగన్ = తగునట్లు; పొసంగున్ = సంభవించును.

తా:—జరిగినదానికి చింతింపకుము. దుర్మార్గుల స్తోత్రము చేయకుము. చెడుకార్యములలో దైన్యము నవలంబించి పాల్గొనకుము. అదృష్టమును నమ్మి యుండుము.

క॥ పనిబూని జనులు సంతత
ము దాలిమి సత్యశౌచ♦ములను బ్రవర్తిం
చిన యశము నొందుచుందురు
గనుగొను మిదె దొడ్డనడక ♦ గాగ కుమారా. 32

టీ:—పనిబూని = ప్రయత్నించి; జనులు = పురుషులు; సంతతమును = ఎడతెగకుండ; తాలిమిన్ = ఓర్పుగను; సత్యశౌచములను = నిజముగనను నిష్కాపట్యముగను; ప్రవర్తించినన్ = నడచినచో; యశము నొందుచుందురు = కీర్తిని పొందుచున్నారు; ఇదె = దీనినే; దొడ్డనడకగాగన్ = మంచిప్రవర్తనముగ; కనుగొనుము = తెలిసికొనుము.

తా:—ఒకడు ప్రయత్నముచేసి యెల్లప్పుడును ఓర్పును, సత్యమును, నిష్కాపట్యమును గలిగి యున్నచో కీర్తి వానిని వరించును.

క॥ విను లోకంబున ధర్మం
బనగ గులాచార మట్లు ♦ యరసి నడువ దా
గను నాయుష్కీర్తుల నిహ
మున బరమున బొందు సౌఖ్య♦ములను కుమారా. 33

టీ:—విను = వినుము; లోకంబునన్ = ప్రపంచములో; ధర్మంబనగన్ = ధర్మమనఁగా; కులాచారమట్లు = తన వర్ణమునకు తగినట్లు; అరసి = తెలిసికొని; నడువన్ = ఆచరింపఁగా; తాన్ = తాను; ఇహమునన్ = ఈ లోకమున; ఆయుః కీర్తులన్ = ఆయుర్దాయ

మును; యశస్సును; కనును = పొందును; పరమునన్ = పరలోకములో; సౌఖ్యములను = సుఖములను; కనును.

తా:—తనకులమునకు దేవునిచే విధింపబడినట్లు నడచుటయే ధర్మ మనఁబడును. అధర్మ మీలోకమున నాయుర్దాయమును కీర్తిని నిచ్చును. పర లోకమున స్వర్గము నిచ్చును.

క॥ సరివారిలోన నేర్పున
దిరిగెడువారలకుగాక, తెరువాటులలో
నరయుచు మెలఁగెడివారికి
పరువేటికి? కీడె యమభవంబు కుమారా. 34

టీ:—సరివారిలోనన్ = సాటివారిలో; నేర్పున దిరిగెడువారలకు = తెలివితో సంచరించువారికి; కాక = తప్ప; తెరవాటులలోన్ = దారిగొట్టి దొంగతనము చేయుటలయందు; అరయుచున్ = బుద్ధి నుపయోగించుచు; మెలఁగెడివారికిన్ = తిరుగువారికి; పరువేటికి = మర్యాద యెందులకు? కీడె = ఇతరుల కపకారము చేయుటయే; యమభవంబు = యమప్రాప్తికరము.

తా:—తన మర్యాదను కాపాడుకొనువాఁడు సాటివారిలో మర్యాదగ సంచరించును. అట్లుగాక దారులు కొట్టి దొంగతనముచేయువారికి కీర్తి వచ్చునా? వారు చేసినకీడే వారికి తర్వాత మృత్యువై పనిచేయును.

క॥ ఒరు లెవ్వరేనిఁ దనతోఁ
బరిభాషించినను మేలు పలుకవలయు సా
దరము గలచోట గీడు
న్గరము నొనర్పంగరాదు గదర కుమారా. 35

టీ:—ఎవ్వరేని ఒరులు = ఇతరు లెవరైనను; తనతో; పరిభాషించినను = మాట్లాడినచో; మేలు = మంచిగా; పలుకవలయున్ = మాట్లాడ

వలెను; సాదరము గలచోటన్ = తనను గౌరవించు స్థలమున; కరము = మిక్కిలి; కీడున్ = అపకారమును; ఒనర్పఁగరాదు గదర = చేయరాదు గదా!

తా:—ఎవరైన పలుకరించిన వారితో శాంతముగ మంచిగ మాట్లాడ వలెను. నిన్ను గౌరవించువారి కెన్నడును అపకారము చేయకుము.

క॥ సిరి చేర్చు బంధువుల, నా
సిరియే శుభముల నొసంగు, చెలువుల గూర్చున్
సిరియే గుణవంతుం డని
ధరలో బొగడించు నంచు దలపు కుమారా. 3౬

టీ:—సిరి = ధనము; బంధువులన్ = చుట్టములను; చేర్చును=దరికి దీయును; సిరియే = ధనమే; శుభములన్ = సౌఖ్యములను; కూర్చున్ = కూర్చును; ధరలోన్ = ఈ లోకమున; సిరియే; గుణవంతుండని = మంచి గుణములు గలవాఁడని; పొగడించున్ = కొనియాడించును; అంచు, తలపు= తెలిసికొనుము.

తా:—ధన మున్న బంధువులు చేరుదురు. ధనముతో నీలోకమున సౌఖ్యము లన్నియు బొందవచ్చును. లోకము ధనముగల వానినే గుణ వంతునిగ పొగడును.

క॥ ఆకులత బడకు మాపద,
నేకతమున జనకు త్రోవ, నింతికి దగునం
తే కాని చను వొసంగకు
లోకులు ని న్నెన్న సుగుణలోల! కుమారా. 3౭

టీ:—సుగుణలోల = మంచిగుణములయం దాసక్తిగల పిల్లవాఁడా! ఆపదన్ = ఆపత్తు సమయమున; ఆకులతన్ = కలవరపాటును; పడకుము;

త్రోవన్ = మార్గమందు; ఏకతమునన్ = ఒంటరిగా; చనకుము = వెళ్ళకుము; ఇంతికిన్ = భార్యకు; తగునంతే కాని = ఎక్కువగా; చను వోసంగకు = మనస్సు నీయకుము; లోకులు, నిన్ను; ఎన్నన్ = పొగడగా.

తా:—ఆపద వచ్చినపుడు కలవరమును పొందకుము. ఒంటరిగా నెచ్చటికి వెళ్ళకుము. భార్యతో తగినంతయే చనవీయవలెను.

క॥ తనదు కులాంగన యాలో
చనమున మంత్రియును భుక్తిసమయంబున దా
జననియు రతిలో రంభా
వనజేక్షణ యయిన బుణ్యవశము కుమారా. ౩౭

టీ:— తనదు కులాంగన = తనపత్ని; ఆలోచనమునన్ = కార్యాలోచనమునందు; మంత్రియును = ప్రధానివలెను; భుక్తిసమయంబునన్ = అన్నము పెట్టునపుడు; తాన్ = తాను; జననియు = తల్లివలెను; రతిలోన్ = శృంగారమున; రంభావనజేక్షణయయిన = రంభవలె నాచరించినచో; పుణ్యవశము = తన సుకృతమని యెంచదగును.

తా:—చిక్కులు వచ్చినపుడు రాజునకు మంత్రివలెను, భోజనము పెట్టునపుడు తల్లివలెను, శృంగారపువేళల రంభవలె నుండు భార్య పూర్వపుణ్యమున గాని లభింపదు.

క॥ మనుజుఁడు సభ్యుఁడు దానై
కనియున్నయథార్థ మెల్లఁ గానని యట్లా
మనుజుండు పలుకకున్నన్
ఘన మగుపాతకము నతడుఁ గనును కుమారా. ౩౮

టీ:—మనుజుఁడు దాను = మనుష్యుడు తాను; సభ్యుఁడై = సభయందొకఁడైయుండి; కనియున్న యథార్థమెల్లన్ = తాను పూర్వము చూచిన

నిజము నంతయు; కానవియట్లు=చూడనట్లుగా, మనుజుండు = మనుష్యుఁడు; పలుకకున్నన్ = చెప్పక పోయినచో; ఘనమగు = గొప్ప; పాతకమును = పాపమును; అతఁడు = వాఁడు; కనును=పొందును.

తా:—ఒకానొక డొకసభయందు గూర్చుని తా విదివఱకు చూచిన యొక విషయమును ఉన్నది యున్నట్లు చెప్పకపోయినచో, వాఁడు పాపియే యగును.

క॥ అంగీకారరహితమగు
సంగతికిం బోవరాదు ♦ సామాన్యులతో
డం గడు జగడమునకు జన
వెంగలితన మందుౘ జనులు ♦ వినుము కుమారా. ౨౦

టీ:—అంగీకార రహితమగు = ఒప్పుదలలేని, సంగతికిన్ = వ్యవహారమునకు; పోవరాదు = పోగూడదు; సామాన్యులతోడన్ = తనకంటె తక్కువవారితో; జగడమునకు జనన్ = పోరాటమున కేగినచో; జనులు; వెంగలితన మందుౘ = మూఢుఁడని పలికెదరు; వినుము.

తా:—లోకులు మెచ్చని పనికి బోరాదు. నీచులతో జగడమాడినచో, నిన్ను తెలివిలేనివానినిగ దలంతురు.

క॥ అల దేవగృహముకడ పై
రుల గోవాటములయందు, ♦ దోౘవలలో ర
చ్చల కొట్టములను నొప్పదు
మలమూత్రవిసర్జనంబు ♦ మహిని కుమారా. ౨౧

టీ;—దేవగృహముకడ = దేవాలయము దగ్గరను;పయిరులన్=పంటగలచోట్ల; గోవాటములయందున్ = ఆవులుండుశాలలలో; త్రోవలలోన్= మార్గములయందు; రచ్చలన్ = సభలయందు; కొట్టములను = సావడుల

యందు; మలమూత్రవిసర్జనంబు = కాలకృత్యముల దీర్చుట; ఒప్పదు = తగదు.

తా:—దేవాలయమునొద్ద, పైరులలో, గోశాలలలో, మార్గములందు, సభలందు, నావడులయందు మలమూత్రములను వదలరాదు.

క॥ తనుజులను సుగురువృద్ధుల
జననీజనకులను సాధు•జనుల నెవఁడు దా
ఘనుఁ డయ్యు బ్రోవఁడో యా
జనుఁడే జీవన్మృతుండు•జగతిఁ గుమారా. ౪౨

టీ:—తాన్ ఘనుఁడయ్యు = తాను ప్రయోజకుఁడయ్యును; తనుజులను = కుమారులను. సుగురు వృద్ధులను = శ్రేష్ఠులగు గురువులను పెద్దలను; జననీజనకులను = తల్లిదండ్రులను; సాధుజనులన్ = సత్పురుషులను; ఎవఁడు, ప్రోవఁడో = రక్షింపఁడో; ఆజనుఁడే = వాఁడే; జగత్తులో; జీవన్మృతుండు = బ్రతికి యుండియు చచ్చినవాఁడు.

తా:—తాను ధనార్జన గల్గియుండి సత్పురుషులను, జననీజనకులను, సాధువులను, కుమారులను, పెద్దలను రక్షింపనివాఁడు బ్రతికియుండియు చచ్చినవాఁడే యగును. వానికి కీర్తిలేదు, ఇహపరములు లేవని యర్థము.

క॥ ధీరుఁడు తనదగుసంపద
జారినయెడ జింతనొంద•జాలక దా ల
క్ష్మీరమణుని వరచరణాం
భోరుహములు గొలిచి ముక్తి•బొందు కుమారా. ౪౩

టీ:—తనదగు = తనకు సంబంధించిన; సంపద = సంపత్తు; జారిన యెడన్ = పోయినపుడు; ధీరుఁడు = ధైర్యముగలవాఁడు; చింత నొంద జాలక = దుఃఖింపక. తాను; లక్ష్మీరమణుని = విష్ణుమూర్తియొక్క; వర

చరణాంభోరుహములు = శ్రేష్ఠములైన పాదపద్మములను; కొలిచి = సేవించి; ముక్తిఁబొందుదున్ = మోక్షమును బొందును.

తా:—కాలవశమున సంపద పోయినచో ధైర్యమును వీడక దుఃఖింపక విష్ణుమూర్తిని నమ్మి కొలిచినవాఁడే ధీరుఁడు. వానికి మోక్షము సిద్ధించును.

క॥ పాపపుపని మదిఁ దలఁపకు
చేపట్టినవారి విడువఁజేయకు కీడున్
లోపల గలపకు కూ్రరుల
ప్రాపును మది నమ్మఁబోకుమి రహిని కుమారా. ౪౪

టీ:—మదిన్ = మనస్సులో; పాపపుపనిన్ = చెడుకార్యమును; తలఁపకుము; చేపట్టినవారిన్ = అభయ మిచ్చినవారిని, విడువజేయకు = వదలి పెట్టకుము; కీడున్ = ఇతరులు చేసిన అపకారమును; లోపలన్ = మనస్సులో; తలపకుము; కూ్రరుల ప్రాపును = దుర్మార్గుల సాన్నిధ్యమును; మదిన్ = మనస్సులో; నమ్మబోకు = విశ్వసింపకుము.

తా:—చెడ్డపనినిఁగూర్చి సంకల్పమునైన జేయకుము. అభయ మిచ్చి రక్షింపక యుండవలదు. ఇతరుల అపకారమును మనమున నుంచుకొనకుము. దుర్మార్గులదరికి జేరకుము.

క॥ జగడంబు లాడుచోటను
మగువలు వసియించుచోట మదగజముదరిన్
పగతుండు దిరుగుచోటన్
మగుడి చనగవలయు చలముమాని కుమారా. ౪౫

టీ:—జగడంబు లాడుచోటను = పోరాటములు గలచోటను; మగువలు వసియించుచోటన్ = స్త్రీలు నివసించుచోటను; మదగజముదరిన్ = మదించిన ఏనుగున్నచోటునను; పగతుండు దిరుగుచోటన్ = శతృవున్న

స్థలమునను; చలము మాని = చాంచల్యమును వదలి; చనగవలయున్ = మఱలి పోవలెను.

తా:—పోరాటము జరుగుచోట్లకును, ఒంటరిగ స్త్రీ లున్నచోట్లకును, మదించిన యేనుగు లున్నచోట్లకును, శత్రువు సంచరించుచోట్లకును బోవవలదు. పోయిన కీడు మూడును.

క॥ దుర్జనులనైన దిట్టకు
వర్జింపకు సుజనగోష్ఠిఁ వరులను నెల్ల
న్నిర్జింతు ననుచు ద్రుళ్లకు
దుర్జను డనియందురు నిందఁ దోఁప కుమారా. ౪౬

టీ:—దుర్జనులనైనన్ = దుర్మార్గులనుగూడ; తిట్టకుము: సుజనగోష్ఠి = మంచివారితోడ సంభాషించుటను; వర్జింపకు = వదలకుము; వరులను నెల్లన్ = శ్రేష్ఠుల నందని; నిర్జింతుననుచున్ = గెలుతునని; త్రుళ్ళకు = అదరిపడకుము; నిందదోపన్ = అపకీర్తి వచ్చునట్లు; దుర్జనుడనియందురు = దుర్మార్గుడని పలికెదరు.

తా:—దుర్మార్గులనైన తిట్టకుము; అందఱిని జయింతు నని గర్వపడకుము. నిన్ను దుర్మార్గునిగ దలంతురు.

క॥ తిరుగకు దుర్మార్గులతో
నరుగకు గహనాంతరస్థలాదుల నొంటిన్
జరుగకు శత్రుల మ్రోల
న్మరువకు మేల్పితులయెడలఁ మదిని కుమారా. ౪౭

టీ:—దుర్మార్గులతోన్ = దుష్టులతో, తిరుగకుము; ఒంటిన్ = ఒంటరిగా; గహనాంతరస్థలాదులకు = ప్రవేశింప వీలులేని మధ్యభాగముగల ప్రదేశములకు; అరుగకు = వెళ్ళకుము; శత్రులమ్రోలన్ = శత్రువుల సమీ

షమున; జరుగకు = సంచరింపకుము; హితులయెడఁ = యోగ్యులయందు; మేల్ = ఉపకారమును చేయుటను; మదిలో, మరువకుము.

తా:—మర్కటులతో సంచరింపకుము. ఒంటిగా నిర్జనమగు వన ముల కేగకుము. యోగ్యులు చేసిన మేలు మరువకుము. శత్రువులదరి జేరకుము.

క॥ తరళాక్షులయెడ నెన్నఁడు
పరిహాసాలాపములను ♦ బచరింపకుమీ
పరికించి నిరీక్షించిన
నురుదోషం బనుచు దలఁపు♦చుండు కుమారా. ౨౪

టీ:—ఎన్నఁడును, తరళాక్షులయెడఁ = స్త్రీలయొద్ద; పరిహాసాలాప లను = ఎగతాళి మాటలను; పచరింపకుమీ = ఉపయోగింపకుమా! పరి కించి = ఆలోచించి; నిరీక్షించినఁ = వారిని చూచినచో; ఉరుదోషం బ నుచుఁ = గొప్పతప్పని; తలపుచుండు = తలపోయుము.

తా:—స్త్రీలతో పరిహాసమాడుట గొప్పతప్పు. వారిని కన్నెత్తి చూచిననే మహాదోషమని చెప్పగా నింక పరిహాసముల కవకాశమేమిగలదు?

క॥ సంపదగలవారిని మో
దింపుచు జుట్టుకొనియుంచు ♦ రెల్లప్పుడు త
త్సంపద తొలంగిన నుపే
క్షింపుదు రవివేకిజనులు ♦ క్షితిని కుమారా. ౨౫

టీ:—అవివేకిజనులు = మోసగాండ్రు; సంపదగలవారిని = ధనముగల వారిని; మోదింపుచు = సంతోషింపజేయుచు; ఎల్లప్పుడు; చుట్టుకొనియుం దురు = మూగియుందురు; సంపదదొలంగినఁ = ధనముపోయినచో; ఉపేక్షిం పుదురు = దరిజేరరు.

తా:—లోకమున మోసగాండ్రు ధనవంతునిచెంత జేరి లాలనజేసి ధనము నపహరింతురు. ధనము పోఁగానే తొలఁగి దూరమున నుందురు. కాన వారిని నమ్మరాదు.

క॥ కాయమున నాటుశరము లు
పాయంబున దీయవచ్చు॥బహునిష్ఠురతన్
గూయ మది నాటుమాటలు
బాయవుగా యెపుడు వెగడు॥పఱచు కుమారా. ౫౦

టీ:—కాయమున = శరీరమునందు; నాటుశరములు = దించిన బాణములను; ఉపాయంబునన్ = ఉపాయముగా; తీయవచ్చును = లాఁగవచ్చును; బహునిష్ఠురతన్ = మిక్కిలినిందగా; కూయన్ = తిట్టినచో; మదిన్ = మనస్సులో; నాటుమాటలు = దిగినపల్కులు; పాయవుగా = పోవుగదా! ఎపుడు; వెగడుపఱచు = తల్లడపెట్టును.

తా:—శరీరమున గుచ్చుకొనిన వాడిబాణములనైనను దీయవచ్చును గాని, నిందించుచు పలికినపలుకులు మనస్సులో నాటినప్పు డేయుపాయముచే నైనను దీయ వలనుపడదు. బాణముకంటెను నిందావాక్యములు బాధను కలుగజేయును. బాణ మిచ్చుబాధ దానిని బైకిదీయునంతవఱకే; నిందను తలఁచినప్పుడెల్ల వేధించును.

క॥ ధరణీజాతము లేయే
తరి నెట్లట్లను ఫలించు॥దగ నటు పూర్వా
చరణఫలంబు ననుభవము
గర మనుభవనీయ మగును ॥ గాదె కుమారా. ౫౧

టీ:—ధరణీజాతములు = వృక్షములు; ఏయేతరిన్ = ఏయేకాలమున; ఎట్లెట్లను = ఏయేరీతిని; తగన్ తగునట్లు; ఫలించున్ = పండ్లనిచ్చునో

అటు = అల్లే; పూర్వాచరణఫలంబు = పూర్వజన్మమున చేసిన కర్మఫలము; కరము = మిక్కిలి; అనుభవనీయముగాదె = అనుభవింపక తీఱదుగదా.

తా:—ఏరీతి ఋతువునందే వృక్షము తన వితనములుగల ఫలములను పండించునో, అల్లే, పూర్వజన్మమున చేసిన పుణ్యాపాప ఫలమున నాయాజనుఁడు అనుభవింపక తీఱదు.

క॥ పెనుకోపము గర్వము ను
బ్బును చలమును దురభిమానమును వ్యాపారం
బున జొరక యునికియును న
ల్పునిగుణము లటంచు దెలివిఁబొందు కుమారా. ౧౨

టీ:—పెనుకోపము = మిక్కిలికోపము; గర్వము; ఉబ్బును = మితిలేని సంతోషమును; చలమును = మత్సరమును; దురభిమానమును = తగని యహంకారమును; వ్యాపారంబున జొరక యునికియును = సోమరితనముచే నుండుటయు; అల్పుని గుణము లటంచున్ = నీచుని స్వభావమని; తెలివి బొందు = తెలిసికొనుము.

తా:—కోపమును, గర్వమును, మితిమీరిన సంతోషమును, మత్సరమును, తగని యహంకారమును, సోమరితనమును వదలవలెను. అవి నీచునిగుణములు.

క॥ విత్తము గూర్చిన మనుజుం
డుత్తమదానంబు భోగ మొందనియెడ భూ
భృత్తస్కరశిఖిగతము వి
వృత్తికరంబునగునట్టిపదవి కుమారా. ౧౩

టీ:—విత్తము గూర్చిన మనుజుండు = ధనము పోగుచేసిన వాఁడు ఉత్తమదానంబు = సత్పురుషునికి దానంబును; భోగ మొందనియెడ = అనుభ

హించుటను చేయనియెడల; అట్టిపదవి = అట్టి ఐశ్వర్యము, భూభృ......గతము; భూభృత్ = రాజులను; తస్కర = దొంగలను; శిఖి = అగ్నిహోత్రమును, గతము = పొందినదియు; విప్రత్తికరంబుగ = దుర్వ్యసనము కలుగ చేయునదియు; అగును.

తా:—తా ననుభవింపని యితరుల కియ్యని పిసినిగొట్టుధనము రాజులు హరింతురు. లేదా దొంగలపా లగును. లేదా అగ్నిపాలగును. లేదా జూదము మొదలగు వ్యసనములపా లగును.

క॥ సద్గోష్ఠి సిరినొసంగును
సద్గోష్ఠియె కీర్తి బెంచు ♦ సంతుష్టిని నా
సద్గోష్ఠియె యొనగూర్చును
సద్గోష్ఠియె పాపములను ♦ జంపు కుమారా. ౫౪

టీ:—సద్గోష్ఠియె = సత్పురుషులతో మాట్లాడుటయే; సిరినొసంగును = ధనము నిచ్చును, సద్గోష్ఠియె; కీర్తిబెంచును = యశస్సు నిచ్చును; ఆసద్గోష్ఠియె, సంతుష్టిని = సంతోషమును; ఒనగూర్చును = సంపాదించును. సద్గోష్ఠియె, పాపములను జంపును = పుణ్యము నిచ్చును.

తా:—సత్పురుషులతో మాట్లాడినమాత్రమున ఐశ్వర్యము, కీర్తి, సంతోషము, పుణ్యము వచ్చును. ఇంక తానే సత్పురుషుం డయిన నెట్టిలాభమో చూడుఁడు.

క॥ ఘనుఁలు విని సమ్మతింపని
పనులకు జొఱబడక పొగడు ♦ పనులకు జొరు మెం
దును బొంకబోవకుము, నె
మ్మిని సుజనులతోడగలిసి ♦ మెలఁగు కుమారా. ౫౫

టీ:—ఘనులు = శ్రేష్ఠులు; విని సమ్మతింపని = వినిహర్షింపని పనులకున్ = కార్యములకు; జొఱబడక = ప్రవేశింపక; పొగడు పను

లను జోరము = శ్లాఘించుపనుల ప్రవేశింపుము; ఎంచును బొంకబోవ కుము = ఎచ్చటను అబద్ధమాడకుము; నెమ్మిని = సంతోషముతో; సుజను లతోడన్ = మంచివారితో; కలిసి మెలఁగు = కలసితిరుగుము.

తా:—పెద్దల కిష్టముగాని పనులను వదలి వారు సంతోషించు కార్యములు చేయనగు. సజ్జనసహవాసము, బొంకకుండుట నభ్యసింపుము.

క॥ జారులతో చోరులతో
కౄరులతో నెపుడు పొత్తుఁగోరక మది స
త్పూరుషపదాంబుజాతా
ధారుఁడవై బ్రతుక కీర్తిఁదనరు కుమారా. ౫౬

టీ:—జారులతోన్ = వ్యభిచారులతో; చోరులతోన్ = దొంగలతో; కౄరులతోన్ = చెడువారితో; ఎప్పుడు, పొత్తుగోరక = స్నేహము చేయక; సత్పూరుష = మంచివారి; పదాంబుజాత = పద్మముల వంటి పాదములు; ఆధారుఁడవై = ఆశ్రయము గలవాఁడవై; బ్రతుకన్; కీర్తిదనరున్ = యశస్సు వచ్చును.

తా:—జారచోర కౄరులస్నేహమును మదిలోనైనదలంపక సత్పురుషుల పాదపద్మముల నాశ్రయించినచో కీర్తిమంతుఁడగును.

క॥ జ్ఞానులచరితము వీనుల
నానుచు సత్పురుషగోష్ఠి ననఘం బనుచున్
బూనుము ధర్మపథంబును
దా నెఱిఁగినయంత మఱువఁదగదు కుమారా. ౫౭

టీ:—జ్ఞానుల చరితము = పుణ్యాత్ముల కథలను; వీనులన్ = చెవులతో; ఆనుచున్ = వినుచు; సత్పురుషగోష్ఠి = సజ్జనులతో మాట్లాడుట; అనఘంబనుచున్ = పాపమును బోగొట్టునని; ధర్మపథంబును = న్యాయ

మార్గమును; పూనుము; తా నెఱిఁగిన యంతఁ = తాను మంచిని తెలిసికొనిన తోడనే; మఱవదగదు = మఱచిపోఁగూడదు.

తా:—పుణ్యాత్ముల కథలు, సత్పురుషసాంగత్యము, ధర్మాచరణము నీయవి యుత్తమోత్తంబు లనందగు. తాను తెలిసికొనిన మంచి విషయములను మరువక ఆచరించి మఱియొకరికి జెప్పవలయును.

క॥ రోషావేశము జనులకు
దోషము తలపోయ విపుల దుఃఖకరము నా
రోషము విడిచినయెడ సం
తోషింతురు బుధులు హితము దోఁప కుమారా. ౫౨

టీ:—జనులకు = మనుష్యులకు; రోషావేశము = కోపమును జెందుట; దోషము = తగనిది; తలపోయఁ = ఆలోచింపఁగా; విపులదుఃఖకరమునా = విస్తారమైన దుఃఖము నిచ్చునదిగూడ నగును; రోషము విడిచినయెడఁ = కోపము వదలినచో; హితము దోఁపఁ = మంచి యగునట్లు; బుధులు = దేవతలు లేక పండితులు; సంతోషింతురు.

క॥ ధనవంతులైన బహుసజ్జనులైనను నీకు మిగుల సమ్మతులైయున్నను సతిజనకునిగృహామందున నుండుట తగదు కీర్తి తొలఁగు కుమారా. ౫౩

టీ:—ధనవంతులైనఁ = భాగ్యవంతులైనను; సజ్జనులైనను = మంచివారైనను; నీకు; మిగుల సమ్మతులై యున్నను = మిక్కిలి యిష్టము గలవారైనను; సతిజనకుని = మామగారి; గృహామందున్ = ఇంటియందు; ఉండుట తగదు; కీర్తి; తొలఁగుఁ = పోవును.

తా:—మామగారెంత భాగ్యవంతులైనను, ఎంతమంచివారైనను, నీకు వారియందును, వారికి నీయందు నెంతప్రేమ యున్నను, వారియింట నుండకుము. లోకులు నిన్ను నగెదరు.

క॥ సభలోపల నవ్వినయెడ
సభికులు నిరసింతు రెట్టిజను నైనను నీ
కభయం బొసంగనేనియు
ప్రభుకరుణను నమ్మి గర్వపడకు కుమారా. ౬౦

టీ:—సభలోపలన్ = సభయందు; నవ్వినయెడన్ = ఊరక నవ్వినచో; సభికులు = సభయం దుండువారు; ఎట్టిజనునైనను = ఎంత గొప్పవానినిగూడ; నిరసింతురు = నిర్లక్ష్యము చేయుదురు; నీ కభయం బొసంగనేనియు = నిన్ను రక్షింతునని వాగ్దానము చేసినను; ప్రభుకరుణను నమ్మి = రాజుగారి యనుగ్రహమును విశ్వసించి; గర్వపడకు = అదరిపడకుము.

తా:—పెద్దలు గల సభయందు గౌరవమును గోరువాఁడు నవ్వఁగూడదు. అట్లు నవ్విన గౌరవభంగము. రాజునకు నీ వెంత యిష్టుఁడవైనను, గర్వపడకుము. రాజుల యనుగ్రహము క్షణకాల ముండునని తలఁచుము.

క॥ తనపంక్తియందు బాంధవ
జనము లొకవిధంబుగా మెసంగుచు నుండం
గను దా సద్రసముల మెసఁ
గిన విషభోజనసమంబు క్షితిని కుమారా. ౬౧

టీ:—తనపంక్తియందున్ = తన ప్రక్కనే; బాంధవజనములు = బంధుసమూహములు; ఒకవిధంబుగా = ఏదో విధముగా; మెసంగుచునుండఁగను = భుజించుచునుండఁగా; తాన్ = తాను; సద్రసములన్ = మంచిరుచిగల పదార్థములను; మెసఁగినన్ = తినినచో; విషభోజనసమంబు = విషము తిన్నట్లగును.

తా:—తన యింటిలో బంధువుల కొకరీతి నన్నము బెట్టి తాను షడ్రసోపేతముగా భుజించి, వారికి లోపము చేసినచో మహాదోషము.

క॥ పెరవార లుండ ఫలముల
నరయంగా వారి కిడక ♦ యాతఁడె మెసవన్
సరిగాదు, విసపుమేతకు
సరియౌ నని తలఁపు మానసమున కుమారా. ౬౨

టీ:—పెరవార లుండన్ = ఇతర స్నేహితులు మొదలగువా రుండఁగా; ఫలములన్ = పండ్లను; వారి కిడక = వారి కీయక; అతఁడె మెసవన్ = తానె తినినచో; సరిగాదు = యుక్తముగాదు; విసపుమేతకు సరియౌ = విషాన్నముతో సమమగును; అని, మానసమునన్ = మనస్సులో; తలఁపుము.

తా:—తనయొద్ద నితరు లున్నప్పుడు పండ్లైనను వారి కిడక తాను భుజించుట కూడదు.

క॥ గుణవంతులసంగతి ని
ర్గుణులకు గుణములు ఘటించు ♦ గుసుమాదిసమ
ర్పణమున వస్త్రాదిక మా
క్షణమున బరిమళము నొందు ♦ కరణి కుమారా. ౬౩

టీ:—గుణవంతుల సంగతి = మంచివారి స్నేహము; నిర్గుణులకున్ = గుణహీనులకు; గుణములు = మంచి బుద్ధులను; ఘటించున్ = సమకూర్చును; కుసుమాది = పుష్పము మొదలగువానియొక్క; సమర్పణమునన్ = ఉంచుట చేత; ఆక్షణమునన్ = అప్పుడే; వస్త్రాదికము = గుడ్డలు మొదలగునవి; పరిమళము నొందు కరణిన్ = సువాసనను పొందురీతిని; అని పైకన్వయము.

తా:—సత్సహవాసము గుణహీనులకు మంచిగుణముల గలిగించును. ఎట్లనఁగా, పరిమళముగల వస్తువులను గుడ్డలయందుగాని నూనెయందుగాని వేసిన నవికూడ పరిమళము గలవి యగుట చూడమా?

క॥ మును స్నానము చేయక చం
దన మలఁదుట యనుచితం బు॥దకయుతవస్త్రం
బును విదలించుట గూడదు
మనమున నివి తెలిసి మనుము॥మహిని కుమారా. ౬౪

టీ:—మును = ముందుగా; స్నానముచేయక, చందనము = మంచి గంధమును; అలఁదుట = పూసికొనుట; అనుచితంబు = తగనిపని; ఉదక యుతవస్త్రంబును = నీరు కారు బట్టను; విదలించుట; కూడదు, ఇవి = వీనిని; మనమున తెలిసి; మనుము = బ్రతుకుము.

టీ:—స్నానముచేసిన తర్వాత మంచిగంధము పూసికొనవలెను. తడి బట్టను విదలించుట తప్పు.

క॥ పరజనులు కట్టి విడిచిన
వరచేలము లైన గట్ట॥వలవదు, వలువన్
నెఱి మాయుమడత మార్చుచు
ధరియించుట యొప్పదండ్రు॥ధరను కుమారా. ౬౫

టీ:—పరజనులు = ఇతరులు; కట్టి విడిచిన = కట్టుకొని విప్పివేసిన; వరచేలములైన్ = శ్రేష్ఠమైన బట్టలైనను; కట్టవలవదు; నెఱి = క్రొత్తగా; మాయు మడతను, మార్చుచు, వలువన్ = బట్టను; ధరియించుట = కట్టు. కొనుట; ఒప్పదండ్రు = తగని పనియని చెప్పుదురు.

తా:—ఇతరులు కట్టి విడిచినచో ఖరీదుగల బట్టలైనను ధరింపగూడదు. ఒకమడత మాసినచో నింకొకమడత పైకి బెట్టి ధరింపగూడదు.

క॥ మును మనుజుఁడు జన్మాంతర
మున జేసిన పుణ్యపాప॥ములు పుడమిని వా
నిని బొందకవిడువవు దే
వుని నిందింపకుము కీడు॥ వొడమ కుమారా! ౬౬

టీ:—మనుజుఁడు = మనుష్యుఁడు, మునుజన్మాంతరమునన్ = పూర్వ జన్మమధ్యయందు; చేసిన, పుణ్యపాపములు = మంచి చెడుగులు; పుడమిని = భూమియందు; వానిని; పొందక = చేరక; విడువవు = వదలిపెట్టవు; కీడు వొడమన్ = అపకారము రాగా; దేవుని నిందింపకుము = దైవమునుదూషింపకుము.

తా:—ఎంతవారికైనను పూర్వజన్మమున చేసినకర్మము లీజన్మమునం దనుభవింపక తీఱదు. అట్లు అనుభవించుసమయమున దైవము చేసినది లేదు గనుక నతని దూషింపఁ బనిలేదు.

క॥ అవయవహీనుని సౌంద
ర్యవిహీను దరిద్రు విద్యరాని యతని సం
స్తవనీయు దేవు శ్రుతులన్
భువి నిందింపఁ దగదండ్రు బుధులు కుమారా. ౬౭

టీ:—అవయవహీనుని = అంగములులేని గ్రుడ్డి కుంటిని; సౌందర్యవిహీనున్ = అందములేనివానిని; విద్యరానియతనిన్ = చదువులేనివానిని; సంస్తవనీయున్ = కొనియాడఁదగినవాని, దేవున్ = దైవమును; శ్రుతులన్ = వేదములను; బుధులు; నిందింపఁదగదండ్రు = దూషింపఁ గూడదని చెప్పెదరు.

తా:—గ్రుడ్డివారిని, కుంటివారిని, అందములేనివారిని, చదువురాని వారిని, యోగ్యులను, దైవమును, వేదములను నిందించిన దోషము.

క॥ లోకమున సర్వజనులకు
నాకాలుఁడు ప్రాణహారి యై యుండఁగ శో
భాకృతకార్యముల వడిం
బ్రాకటముగ జేయకుండఁ గాదు కుమారా. ౬౮

టీ:—లోకమునన్ = జగతిలో, అకాలుఁడు = ఆయముఁడు, సర్వప్రాణులకున్ = అన్నిప్రాణులకు, ప్రాణహారియై యుండగన్ = చంపువాఁడైయుండఁగా; శోభాకృతకార్యములన్; శోభా = పుణ్యముతో, కృత = చేయబడు; కార్యములను = పనులను; వడిన్ = వేగముగా, ప్రాకటముగన్ = అతిశయముగా, చేయకుండరాదు = చేసితీఱవలెను.

తా:—మృత్యు వెప్పటికైనను దప్పదుగాన, వెంటనే పుణ్యకార్యములనుచేసి తరించుట బుద్ధిమంతునిపని.

క॥ అల సరసాన్నంబుల బరి
మళముం గల వస్తువులను ♦ మహితలయానం
బుల నాసనముల నుబ్బకు
కలుగుం జను గాలవశము♦గాను కుమారా. ౬౯

టీ:—అలసరసాన్నంబులన్=ధాన్యవిశేషముచే మంచిరుచిగల పదార్థములచే; పరిమళముగల వస్తువులను = సువాసన ద్రవ్యములచే; మహితలయానంబులన్ = భూమిమీద పోవువాహనములచే: ఆసనములన్ = సింహాసనములచేతను; ఉబ్బకు = సంతోషింపకుము; కాలవశముగాను = కాలాధీనముగా, కలుగున్ = వచ్చును; చనున్ = పోవును.

తా:—రుచిగలపదార్థముల, ధన, కనక, వస్తువాహనముల జూచి విఱ్ఱవీగకుము. అవి రావలసివచ్చును, పోవలసిపోవును. నీచేత నేమియులేదు.

క॥ ప్రజ్ఞావంతునిచేతను
ప్రజ్ఞాహీనునకు గడమ ♦ వాటిల్లు నిలన్
బ్రాజ్ఞత గల్గి నటించిన
తత్ జ్ఞులు నుతియింతు రదియె ♦ ధనము కుమారా. ౭౦

టీ:—ప్రజ్ఞావంతునిచేతను = తెలివిగలవానిచేత; ప్రజ్ఞాహీనునకుఁ = తెలివితక్కువవానికి, కడమ = కష్టము, వాటిల్లును = చేకూరును; ప్రాజ్ఞత గల్గి = తెలివిగలిగి; నటించినఁ = వ్యవహరించినచో, తజ్జ్ఞులు = పండితులు; నుతియింతురు = పొగడుదురు; అదియె = అపొగడ్తయే; ధనము = సంపద.

తా:—లోకమున తెలివిగలవాఁడు తెలివితక్కువవానిని మోసగించుచున్నాఁడు. కాన నీవుగూడ తెలివిగలిగి ప్రవర్తించిన సర్వధనములు నందే యున్నవి.

క॥ మనుజులు తమసౌఖ్యము కొఱ
కును సంరక్షణము నవని♦గోరుదు రొగి నే
జనపాలుఁడు సంరక్షిం
పనుదగియును బ్రోవఁ డతఁడె♦పాపి కుమారా. ౭౧

టీ:—అవనిఁ = భూమిలో; మనుజులు; తమసౌఖ్యము కొరకును = తమ ఆనందముకొఱకు; సంరక్షణముఁ = అభయమును; కోరుదురు; ఒగిఁ = వరుసగా; ఏజనపాలుఁడు = ఏరాజు. సంరక్షింపను దగియును = రక్షింపశక్తిగలిగియు; ప్రోవఁడో = రక్షింపఁడో; అతఁడె = ఆరాజే; పాపి = పాపాత్ముఁడు.

తా:—ప్రజలసౌఖ్యమును జూడక వారి కష్టముల బోగొట్టని రాజు మహాపాపాత్ముఁడు; నరకమును బొందును.

క॥ మండలపతి దండార్హుల
దండింపక యుండరాదు ♦ ధారుణి నతఁడా
ఖండలసమానుఁడైనను
మెండగు పాపంబు నొంది ♦ మెలఁగు కుమారా. ౭౨

టీ:—మండలపతి = రాజు; దండార్హులన్ = శిక్షింపఁదగిన వారిని; దండింపక యుండరాదు = శిక్షింపక యుండఁగూడదు; ధారుణిన్ = భూమిలో; అతఁడు; అఖండలసమానుఁడైనను = దేవేంద్రునితో సరియగువాఁడైనను; మెండగు = గొప్ప; పాపముబొంది = పాపముపొంది; మెలఁగు = సంచరించును.

తా:—తానురాజైయుండి శిక్షింపఁదగిన దుష్టులను శిక్షింపనిచో వారు సత్పురుషుల బాధింతురు గాన ఆదోషము రాజును జెందును.

క॥ గృహదాహకునిం బరదా
రహరున్ బంధుహితకార్య • రహితుని దుష్టో
త్సహపరుని జంప నరపతి
ఇహపరములయందు గీర్తి • నెసగు కుమారా. 23

టీ:—గృహదాహకునిన్ = ఇండ్లు నిప్పుపెట్టువాని; పరదారహరున్ = ఇతరునిభార్యను దొంగిలించువాని; బంధు = బంధువులకు; హిత = యోగ్యమైన; కార్యరహితుని = ఉపకారము చేయనివాని; దుష్టోత్సహపరున్ = దుర్మార్గపు పనియందు ఆసక్తిగలవానిని; చంపన్; నరపతి = రాజు; ఇహపరములయందున్ = ఈలోకమందు స్వర్గమందుగూడ; కీర్తి నెసఁగు = యశస్సుతో నొప్పును,

తా:—ఇండ్లు కొల్చువాని; పరభార్యాసక్తుని, బంధువుల కపకారము చేయువానిని, దుర్మార్గులను జంపిన రాజు శాశ్వతకీర్తిమలదూగును.

క॥ గరళము బెట్టెడువాని
న్బరుజంపఁదలంచువాని • బనులెల్ల బయ
ల్పుఁగ చెడివానిం బరధన
హారుని నృపతిజంపి పుణ్యుఁ • డగును కుమారా. 24

టీ:—గరళము బెట్టెడువానిన్ = విషముబెట్టువానిని; పరుజంప దలంచువానిన్ = ఇతరుల హింసించువానిని; పనులెల్ల బయల్పఱచెడి వానిన్ = రహస్యముల నన్నియు నందరికి జెప్పెడివాని, పరధనహారుని = ఇతరులసొమ్ము నపహరించువానిని; నృపతి = రాజగువాఁడు; చంపి; పుణ్యు డగును = పుణ్యాత్ముఁడగును.

తా:—విషప్రయోగము చేయువాని, ఇతరుల హింసించువాని, రహస్యముదాఁచనివాని, దొంగను రాజు చంపవలెను. చంపనిచో దోషము, చంపిన మీదుమిక్కిలి పుణ్యము.

క॥ సత్తువగలయాతనిపై
నెత్తినదుర్బలుఁడు తస్క♦రించినయతఁడున్
విత్తము గోల్పడు నతఁడును
జిత్తనిపీడితుఁడు జింత ♦ జెందు కుమారా. ౭౫

టీ—సత్తువగలయాతఁడు = బలముగలవాఁడు; పైనెత్తిన దుర్బలుఁడు = పైన బరువుగల బలహీనుఁడు; తస్కరించినయతఁడున్ = దొంగవాఁడు; విత్తము గోల్పడునతఁడు = ధనము పోయినవాఁడు; చిత్తని పీడితుఁడు = మనోవ్యాధి గలవాఁడు; చింతజెందున్ = దుఃఖమును బొందుదురు.

తా:—విపరీత బలముగలవాఁడు, బరువు మోయువాఁడు, దొంగ, ధనముపోయినవాఁడు, మనోవ్యాధి గలవాఁడు, వీరల కెన్నఁటికిని సుఖము లేదని యర్థము.

క॥ కత్తిని జేతను బట్టుచు
మొత్తదలఁచి వచ్చువాని ♦ ముఖ్యముగా మే
ల్వాత్తించిన నదె ప్రాయ
శ్చిత్త మతని జంపదగదు ♦ చిన్ని కుమారా. ౭౬

టీ:—కత్తిని చేతనుబట్టుచున్ = చేతియందు కత్తిని ధరించి; మొత్తదలంచి = చంపదలంచి; వచ్చువానిన్ = ఎదుర్కొనువానిని; ముఖ్యముగా = శ్రేష్ఠముగా; మేల్ హత్తించినన్ = ఉపకారము జేసినచో; అదె, ప్రాయశ్చిత్తము = తగినపని; అతని జంపదగదు = వాని బాధింపఁగూడదు.

తా:—నిన్నుజంప కత్తిబట్టుకొనివచ్చిన కూరునియందు గూడ నీవు ఉపకారబుద్ధిని వదలనిచో, నీవంటివాఁ డీలోకమున నింకొకఁ డుండఁడు.

క॥ ఓరిమియె కలిగియుండిన
వారలగని ప్రజ్ఞలేని • వా రనియెదరా
నారయ సత్పురుషాళికి
నోరిమియే భూషణంబు • రోరి కుమారా. ౭౭

టీ:—ఓరిమియె = ఒర్పునె; కలిగియుండినచో. వారలగని = వారిని చూచి; ప్రజ్ఞలేనివారని = తెలివిలేనివారని; అనియెదరు = లోకులందురు, కాన్ = నిజమే; అరయన్ = ఆలోచింపగా; సత్పురుషాళికిన్ = గుణవంతుల సమూహమునకు; ఓరిమియే = ఓర్పే; భూషణంబు = ఆభరణము.

తా:—ఇంకొకరు బాధించినను శాంతముగలవానిని లోకులు తెలివిలేని వానినిగ దలంతురు. కాని ఆ శాంతగుణమే వానిని లోకమునకు కీర్తివంతునిగ ప్రకాశింపఁజేయును.

క॥ పురుషుం డొనర్పని పనికి
నరయగ దైవం బదెట్టు • లనుకూలించున్
సరణిగ విత్తకయున్నను
వరి పండునె ధరణిలోన • వరలి కుమారా. ౭౮

టీ:—పురుషుండొనర్పని = మనుజుఁడు చేయని; పనికిన్ = కార్యమునకు; దైవంబు = దేవత; అదెట్టులనుకూలించున్ = అది ఏవిధమున

సాయపడును; సరణిగన్ = తగురీతిని. విత్తకయున్నను = విత్తనములునాట నిచో; ధరలో, వరి = వరిపైరు; వరలి=వృద్ధిపొంది; పండునె = ఫలించునా?

తా:—తా నొక పనికై సరిగా ప్రయత్నము చేసి ఫలము దైవము మీఁద నుంచవలెను. ప్రయత్నము లేనిది దైవసహాయములేదు. విత్తనమే నాటకపోయిన చెట్టు మొలచుటెట్లు? కాయలు కాచుటెట్లు?

క॥ తన సత్కార్యాచరణం
బున భాగ్యము వేగవృద్ధి • బొందు జగత్ప్రా
ణుని వరసాహాయ్యముచే
ననలం బెంతైన బెరుగు•నయ్య కుమారా. ౨౯

తన; సత్కార్యాచరణంబునన్=మంచిపనుల చేయుటచేత; భాగ్యము=సిరి; వేగ = వెంటనే, వృద్ధిబొందు = పెరుగును; జగత్ప్రాణుని = జగత్తును బ్రతికించు వాయువుయొక్క; సాహాయ్యముచేన్ = వీఁచుటచే; అనలంబు= అగ్ని; ఎంతైన బెరుగు = ఎంతయు వృద్ధిపొందును.

తా:—మంచి నడవడి భాగ్యమును పెంచును. వాయువు వీఁచు నపు డగ్నిహోత్రము మిక్కిలి వృద్ధిని బొందును గదా!

క॥ చమురింకిపోయినను దీ
పము శమియించిన విధంబు • పౌరుషము విహీ
నమె యగును దైవ మనుకూ
లముగాకుండినను భూత•లమున కుమారా. ౩౦

టీ:—చమురింకిపోయినను = నూనె అయిపోయినచో, దీపము; శమియించిన విధంబు = ఆరిపోయినరీతి; దైవమనుకూలము గాకుండినను = దేవుఁడు సహాయము చేయనిచో, పౌరుషము = పురుషుని ప్రయత్నము, విహీనమై యగును = నాశనమును బొందును.

తా:—నూనె లేనప్పుడు దీపము ఆరిపోయినట్లు దైవసాహాయ్యము లేనిది కార్యములు ఫలిఁపవు. ఇచ్చట నూనెయే దైవము. దీపమే ప్రయత్నము,

క॥ ఘనబీజ సహాయ్యములే
కను భూములు నిష్ప్రయోజకంబైన విధం
బున దైవము తోడిలగా
కనె పౌరుషకర్మఫలము ♦ గలదె కుమారా. ౧౧

టీ:—ఘన = గొప్పదైన, బీజసహాయ్యము లేకను=విత్తనములేనిచో; భూములు = పొలములు; నిష్ప్రయోజకంబైన విధంబునన్ = ఉపయోగము లేని రీతిని; ఇల = భూమియందు; దైవముతోడుగాకనె = దేవసాహాయ్యము లేకయే; పౌరుష కర్మఫలము కలదె = పురుషుఁడు జేసినపనికి ప్రయోజనము కలదా?

తా:—విత్తనమే లేనిచో భూములెంత సారము గలవియైనను పండనట్లు, దేవ సహాయ్యము లేనిచో మనమెంత ప్రయత్నించినను కార్యములు నెఱవేరవు.

క॥ ధర నేవస్తువులైనన్
దరుగుటకయి వృద్ధినొందు ♦ దగ బొడ వెదుగున్
విరుగుటకై పాయుటకై
దరిజేరును వీనిమదిని ♦ దలఁపు కుమారా. ౧౨

తా:—ధరన్ = భూమిలో; ఏవస్తువులైనన్ = ఏపదార్థములైనను, తరుగుటకై = నశించుటకై, వృద్ధినొందున్ = పెరుగును; తగన్=తగిన రీతి; విరుగుటకై = కూలుటకై; పొడవెదుగున్ = పెరుగును. పాయుటకై = వీడిపోవుటకై; దరిజేరును = సమీపించును; వీనిని మనస్సులో నెఱుఁగుము.

తా:—వృద్ధిపొందిన వస్తువు లెప్పటికైన నశింపక తప్పదు. పెరిగిన చెట్లు తప్పక విరుగుచున్నవిగదా! నిన్ను సమీపించిన పదార్థము ఎప్పటికైనను నీనుండి విడిపోవును. అటులనే కష్టసుఖములు, ధనదారిద్ర్యములు శాశ్వతములు కావవి తాత్పర్యము.

క॥ జనియించుట పొలియుటకే
పెనుసుఖ మొందు టది కష్ట ♦ విధి నొందుటకే
విను హెచ్చుట తగ్గుటకే
యని మనమున నమ్మవలయు ♦ నయ్య కుమారా. ౮౩

టీ:—జనియించుట = పుట్టుట; పొలియుటకే = చచ్చుటకే; పెను సుఖమొందుట = గొప్పసౌఖ్యములనొందుట; కష్టవిధి నొందుటకే = దుఃఖ మార్గమును జేరుటకే; హెచ్చుట = వృద్ధిపొందుట, తగ్గుటకే = క్షీణించుటకే; అని మనస్సులో నిశ్చయించుకొనవలెను.

తా:—పుట్టినవాఁడు చావకమానఁడు. సౌఖ్యము లెల్లకాలము ఉండవు. వృద్ధిపొందినదెల్ల నశింపకతీఱదు. ఏదియు నీజగతి శాశ్వతము కాదు గాన విజ్ఞులీగతి ధర్మము నాచరింపుమని నీతి.

క॥ ఎటువంటి వరకులంబున
పటుతరముగ బుట్టెనేని ♦ బరగగ మునుగ
న్నటువంటి కర్మఫలముల
గటకట భోగింపవలయు ♦ గాదె కుమారా. ౮౪

టీ:—ఎటువంటి = ఎట్టి; వరకులంబున = శ్రేష్ఠజాతియందు. పటుతరముగఁ = గొప్పగ; పుట్టెనేని = జనించినను; పరగగఁ = ఒప్పగా; మునుగన్నటువంటి = పూర్వముచేసిన; కర్మఫలములఁ = పనుల అనుభవములను; కటకట = పండ్లు పటపటమనిపించుచు; భోగింపవలయుగాదె = అనుభవించి తీఱవలెనుగదా!

తా:—ఎంతగొప్పపదవియందున్నను, ఎంతగొప్పకులమున బుట్టినను, ఎంతసంపదయున్నను, పూర్వజన్మమున చేసిన మంచిగాని చెడుగుగాని అనుభవింపక తీఱదు. దైవముగూడ తీసివేయలేఁడని నమ్ముము.

క॥ పెక్కుజనులు నిద్రింపఁగ
నొక్కం డయ్యెడను నిద్రనొందక యున్నన్
గ్రక్కున నుపద్రవంబగు
నక్కర్మమునందుఁ జొరకుమయ్య కుమారా. ౪౫

టీ:—పెక్కుజనులు = చాలమంది; నిద్రింపఁగన్ = నిద్రపోవుచుండఁగా; ఒక్కండు = అందులో నొకఁడు; అయ్యెడను = ఆచోటు; నిద్రనొందక యున్నన్=నిదురపోక యున్నచో; గ్రక్కునన్=శీఘ్రముగా; ఉపద్రవంబగున్ = కష్టము వచ్చును; అక్కర్మమునందున్= ఆపనియందు; చొరకుము = ప్రవేశింపకుము.

తా:—పదిమందియు నిద్రపోవుచున్నచో అచ్చట మెలకువతో నీవు కూర్చున్నచో నీమీద దొంగవనియో, జారుఁడవనియో నేరమును వారు మోపవచ్చును.

క॥ మధురంబుల గొననొల్లఁడు
బుధజనుఁ డేకతమ దారిఁ బో నొల్లఁడు నీ
విధ మెఱిఁగి నీవును మనో
రథసిద్ధుఁడ వగుచు మెలఁగరాదె కుమారా. ౪౬

టీ:—బుధజనుఁడు = తెలివిగలవాఁడు; మధురంబులన్ = రుచిగలవానిని; తిననొల్లఁడు = తినఁడు; ఏకతమ = ఒంటరిగా; దారిఁబోనొల్లఁడు = మార్గమునఁబోఁడు; నీవును; ఈవిధమెఱింగి; మనోరథసిద్ధుఁడవగుచున్=కోరికలు ఫలించినవాఁడవై మెలఁగరాదె=సంచరింపఁగూడదా?

తా:—రుచిగల పదార్థముల లెక్కవగా దినకుము. ఒంటరిగ బాటను బోకుము. నీకు కోరికలన్నియుఁ జేకూరును.

క॥ ధనవంతుఁడె కులవంతుఁడు
ధనవంతుఁడె సుందరుండు ♦ ధనవంతుండే
ఘనవంతుఁడు బలవంతుఁడు
ధనవంతుఁడె ధీరుఁ డనుచు ♦ దలఁపు కుమారా. ౮౭

టీ:—ధనవంతుఁడె = ధనముగలవాఁడె; కులవంతుఁడు = మంచి కులమున బుట్టినవాఁడు; ధనవంతుఁడె; సుందరుఁడు = అందమైనవాఁడు; ధనవంతుండే, ఘనవంతుఁడు = గొప్పవాఁడు; ధనవంతుఁడే; బలవంతుడు = బలముగలవాఁడు; ధనవంతుఁడే, ధీరుఁడు = ధైర్యముగలవాఁడు.

తా:—ధనముగలవాఁడె, కులవంతుఁడు; సుందరుఁడు; గొప్ప వాఁడు; బలముగలవాఁడు; ధైర్యవంతుఁడు, ధనమూల మిదంజగత్తని తెలియుమా !

క॥ విను ప్రాణరక్షణమునఁ
ధన మంతయు మునిఁగిపోవు ♦ తఱి పరిణయమం
దున గురుకార్యమున వధూ
జనసంఘములందు బొంక ♦ జనును కుమరా. ౮౮

టీ:—ప్రాణరక్షణమునఁ = ప్రాణము కాపాడవలసి నపుడు; ధనమంతయు మునిఁగిపోవుతఱిఁ = డబ్బంతయు నష్టమగునపుడు; పరిణయ మందున = వివాహసందర్భమున; గురుకార్యమునఁ = గురువుగారి పని యందు; వధూజనసంఘములందుఁ = స్త్రీ సమూహమునందును; బొంక జనును = అబద్ధ మాడవచ్చును.

తా:—బొంకుట తప్పైయైనను, ప్రాణమున కపాయము వచ్చి నపుడు, ధన మంతయు పోవునపుడు. వివాహము కూర్చు సమయములోను,

గురువుగారి నిమిత్తము సహాయముచేయు సమయములో బొంకినను దోసము లేదని ధర్మసూక్ష్మమును గుర్తింపవలెను.

క॥ కులభామిని విడువకుమీ
పొలతుల నీక్షించి మోహ • మున బొరలకుమీ
ఖలు డందు రెట్టివారలు
కులహీనుఁడు బుట్టెననుట • కొఱలు కుమారా. ౮౯

టీ;—కులభామినిన్ = కులస్త్రీని; భార్యనని యర్థము, విడువకుము; పొలఁతులన్ = స్త్రీలను; ఈక్షించి = చూచి; మోహమునన్ = అజ్ఞానమున; పొరలకుమీ = పొంగకుమా; ఎట్టివారలు = ఎటువంటివారును; ఖలు డందురు = నీచుఁడని తలఁతురు, కులహీనుఁడు = తనకులమర్యాద లేని వాఁడు; పుట్టెననుట = జనించెననుట; కొఱలు = న్యూనత,

తా:—స్వభార్యను విడువగూడదు. అన్యస్త్రీని గ్రహింపఁగూడదు. ఆబాలగోపాలము నిన్ను నీచునిగ దలంతురు; దాన నీ కులగౌరవము నశించును,

క॥ చపలాత్మఁ డవనిలోపల
నపాత్రజనులకును దాన • మందిచ్చుట హీ
నపుకుక్కనోటిలోపల
నిపుణత నెయి పోసినట్లు • నెగడు కుమారా. ౯౦

టీ:—అవనిలోపల = భూమియందు; చపలాత్ముఁడు = చంచల స్వభావుఁడు; అపాత్రజనులకును = యోగ్యులుకాని జనులకు; దానము దిచ్చుట = కానుకలిచ్చుట: హీనపుకుక్క నోటిలోపల = నీచమైనకుక్క నోటిలో; నిపుణతన్ = నేర్పుగా; నెయిపోసినట్లు, నెగడున్ = ఒప్పును.

తా:—యోగ్యుడైనవానికి దానమిచ్చినగాని ఫలములేదు. గిన్నెడు నేయి కుక్కనోటిలో పోసిన దానికి దానిరుచి యేమి తెలియును. నేయి గూడ వ్యర్థమగును.

క॥ యోగ్యుల నరయఁగలేక య
యోగ్యులకుఁ దాన మొసఁగుచుండుట యది స
ద్భాగ్యసతిఁ షండునకుఁ
భాగ్యముగని పెండ్లిసేయు పగిది కుమారా. ౯౧

టీ:—యోగ్యులఁ = మంచివారిని; అరయలేక = గుర్తింప నేరక అయోగ్యులకుఁ = నీతిలేనివారికి; దాన మొసఁగుచుండుట = ధర్మము చేయుట; అది; సద్భాగ్యసతిఁ=మంచివానిచే అనుభవింపఁ దగినస్త్రీని; భాగ్యముగని = ధనము నేచూచి; షండునకుఁ = నపుంసకునకు; పెండ్లిసేయు పగిది = వివాహాచేసిన రీతియగును.

తా:—సత్పురుషులకు దానమిచ్చినచో సఫలమగును. వారు దానిని పుణ్యకార్యములకు వినియోగింతురు. అందమైనస్త్రీని షండునకిచ్చిన నిష్ప్రయోజనము. ఏదైనను తగిన పాత్రియందుంచిన నే శోభ, లేనిచో వ్యర్థము.

క॥ దీనుండైనను శాత్రవు
డైనఁ శరణననుచు వేడు నపుడు ప్రియత న
మ్మానవునికోర్కె దీర్చిన
వాని సుజనుడండ్రు బుధులు వసుధ కుమారా. ౯౨

టీ:—దీనుండైనను = దైన్యముగలవాఁడైనను; శాత్రవుఁడైనఁ = విరోధియైనను; శరణనుచు వేడునపుడు= రక్షింపుమని ప్రార్థించునప్పుడు; ప్రియతఁ = ప్రేమతో; అమ్మానవుని = ఆ జనుని; కోర్కెదీర్చినఁ = కోరిక పూర్తిచేసినచో; వానిని; బుధులు; సుజనుడండ్రు = మంచివాఁడందురు.

తా:—శరణన్నచో శత్రువు నైనను రక్షించినచో సుగుణవంతు డగును.

క॥ పాపంబులందు నెక్కుడు
పాపములు సుమీ ధరిత్రిపయి క్రోధగుణం
బేపారు లోభంబును, నివి
యేపురుషుల జెందగూడ దిలను కుమారా. ౯౩

టీ:—ధరిత్రిపై; క్రోధగుణంబు = కోపము; ఏపారులోభంబును = వృద్ధిపొందిన పిసినిగొట్టుతనంబును; పాపంబులందు నెక్కుడు పాపములు= అన్ని పాపములలో నెక్కువ దోషములుగలవి; ఇవియే పురుషులను జెంద గూడదు.

తా:—పాపములన్నిఁటిలోను గ్రోధ, లోభములు మహాదుష్టములు; అవశ్యము వర్జింపఁదగు.

క॥ మునుగల్గి ధర్మమును జే
యునతఁడు పేదవడె నేని, నున్నంతకు దో
చినభంగిని నర్థుల కి
చ్చు నతఁడె బహుపుణ్యపూరుషుండు కుమారా. ౯౪

టీ:—మునుగలిగి = ముందుగా; ధర్మమును జేయునతఁడు = దానములు చేసినవాఁడు; పేదవడె నేనిన్ = బీదవాఁడైనచో: అంతకు దోఁచినభంగిన్ = ఉన్నదానిలో దోఁచినరీతి = అర్థులకున్ = యాచకులకు; ఇచ్చునతఁడే; బహుపుణ్యపురుషుండు = మిక్కిలి పుణ్యాత్ముఁడు.

తా:—ధనవంతయు ముందుగా దానములచే వ్యయమైనచో, నీకున్నదానిలో దగినట్లు ధర్మము చేయుము.

క॥ కడుమెల్లన నిడు నుత్తర
మడచును గోపమును, దీక్ష్ణమమరఁగ దాన
ప్పుడు నుడివెడి యుత్తర మది
వడిగోపము బెంచునరయ వసుధ కుమారా. ౯౫

టీ:—కడుమెల్లన = మిక్కిలి నెమ్మదిగా. ఇడును త్తరము=ఇచ్చు సమాధానము; కోపమునడంచును = శాంతిని గలుగజేయును; తీక్ష్ణమమరఁగ= కఠినమగునట్లు; దాను, అప్పుడు = కోపముగలవాఁడు మాట్లాడుచుండఁగా; నుడివెడి = పల్కెడి; ఉత్తరము = పల్కు; అతివడిఁ = తొందరగా, కోపము బెంచును = క్రోధమును వృద్ధిపఱచును.

తా:—ఎదటి పురుషుఁడు కోపముతో నున్నప్పుడు నీవు శాంతముతో మాట్లాడిన వాని కోపము శమించును. నీవు గూడ గోపముతో మాట్లాడి నచో వానికోపము మఱింత బెరుగును.

క॥ మిత్రుండు తనకు విశ్వా
మిత్రము జేసినను గాని మేలనవచ్చుఁ
శాత్రవుఁడు మందు గొన్నను
ధాత్రిం దన కదియు కీడు దలఁప కుమారా. ౯౬

టీ:—మిత్రుండు = స్నేహితుఁడు, తనకు; విశ్వామిత్రము జేసినను గాని = ప్రపంచములో లేని ద్రోహము చేసినను; మేలనవచ్చుఁ =మంచి యనఁదగు; శాత్రవుఁడు = విరోధి; మందుగొన్నను = మందు తీసికొనినను; ధాత్రిఁ = జగతిలో, తనకు, అదియె కీడు = అదియే ముప్పు.

తా:—స్నేహితుఁ డొక్కప్పుడు నీ కుపకారము జరుగవలెనని చేసినపని మిక్కిలి యపకారమై తోఁచినను దప్పులేదు. కాని శత్రువు తన ఉపయోగమునకై నీవద్ద నౌషధమును దీసికొన్నను నమ్మఁగలదు.

క॥ ధరనొక్క బుద్ధిహీనుం
దిరముగ రోటనిడి దంచె ♦ నేనియు బెలుచన్
దురు మగును గాని యతనికి
సరసత్వము గలుగదండ్రు ♦ సతము కుమారా. ౯౭

టీ:—ధరలో; ఒక్క బుద్ధిహీనుని = అవివేకిని; తిరముగ = స్థిరముగా; రోటనిడి దంచెనేనియు = రోటియందుంచి దంచినను; తురు మగునుగాని = పొడిపొడి యగునుగాని; అతనికి; సరసత్వము = మనస్సులో మృదుత్వము, కలుగదని చెప్పెదరు.

తా:—బుద్ధిహీనుఁడగువాఁ డెంత చెప్పినను వివేకియగుట దుర్లభము. అతని కొఱకు చేయుప్రయత్నములు వృధయేయగును.

క॥ విత్తంబు విద్య కులము
న్మత్తులకు మదంబొసంగు ♦ మాన్యులకున్ స
ద్వృత్తి నొసంగున్ వీనిన్
జిత్తంబున నిడి మెలంగ ♦ జెలువు కుమారా. ౯౮

టీ:—విత్తంబు = ధనము; విద్య = చదువు; కులము = జాతి; మత్తులకున్ = మదించినవారికి, మదంబొసంగున్ = పొగరు గలిగించును; మాన్యులకున్ = మంచివారికి; సద్వృత్తి నొసంగున్ = మంచి నడవడి నిచ్చును. వీనిన్, జిత్తముననిడి = పై సంగతుల మనస్సులోనుంచుకొని, మెలంగ జెలువు = సంచరించుట యుక్తము.

తా:—ధనము, విద్య, కులము మొదలగునవి మర్మాత్ములకు దుర్మార్గమును బెంచును, సత్పురుషులకు గుణము నిచ్చును.

క॥ ధర గలవు గోరి దానం
బిరవున నిడికొనినవాని ♦ నెగ్గింపఁదలం
తురు వాని నమ్మఁదలఁచిన
పురుషుని నుత్తముఁడటంచు ♦ పొగడి కుమారా. ౯౯

టీ:—ధరన్ = భూమిని; గలవుగోరి = హద్దునుజేసి; దానంబు = ధర్మమును; ఇరవునన్ = స్థిరముగా; ఇడికొనినవానిన్ = ఉంచుకొనినవానిని; నెగ్గింపఁదలఁతురు = చంపఁజూతురు; వానిన్ = అభూములను; అమ్మం దలఁచిన పురుషుని = క్రయముచేయువానిని; ఉత్తముఁడటంచుపొగడి = మంచివాఁడని కొనియాడి (పైకి అన్వయము.)

తా:—ఉచితముగ భూదానముచేయుచు హద్దుల నేర్పరచిన వానిని జంపి, ఖరీదుకు భూమి నమ్మినవానిని మంచివాఁడని పొగడుట యెంత అజ్ఞానమో చూడుడు.

క॥ ఋణ మధిక మొనర్చి సమ
ర్పణ జేసినతండ్రి విద్య♦రానికొడుకు ల
క్షణశాలి రాణి దుశ్చా
రిణియగు జననియును దలప ♦ రిపులు కుమారా. ౧౦౦

టీ:—ఋణమధిక మొనర్చి = ఎక్కువ అప్పుచేసి; సమర్పణచేసిన = కుమారునకిచ్చిన; తండ్రియు; విద్యరానికొడుకు = చదువులేని తనయుడు; లక్షణ శాలి రాణి = మిక్కిలి అందగత్తెయగుభార్య; దుశ్చారిణియగు జనని = మంచినడవడిలేని తల్లియు, రిపులు = శత్రువులు.

తా:—కుమారునకు అప్పునప్పగించిన తండ్రి, చదువురానికొడుకు, మిక్కిలి యందగత్తెయైనభార్య, దుర్మార్గపుతల్లి వీరిని వదలవలెను.

క॥ మర్మము పరులకు దెలుపకు
దుర్మార్గుల చెంత నెపుడు♦దూరకు మిల దు
ష్కర్మముల జేయనొల్లకు
నిర్మలమతి మనుట లెస్స♦నిజము కుమారా. ౧౦౧

టీ:—పరులకున్ = ఇతరులకు; మర్మము = రహస్యము, తెలుప కుము; దుర్మార్గుల చెంత నెపుడు = దుష్టులయెదుట నెప్పుడును; దూర కుము = నిందింపకుము; దుష్కర్మముల జేయనొల్లకు = చెడ్డపనులజేయకుము; నిర్మలమతిన్ = చెడ్డతలంపులు లేనిమనస్సుతో; మనుట = జీవించుట; లెస్స = మేలు; నిజము = ఇదిసత్యముసుమా.

తా:—నీరహస్యముల బయల్పరుపకుము, దుష్టులను యెదుటదూర కుము, చెడుపనులుచేయకుము, మంచి బుద్ధితో జీవించుట మేలు.

క॥ సారమతి నిటుల దిరిగెడి
పూరుషరత్నంబు కీర్తి♦బొందుచు ధరపై
గోరిన కోర్కెఫలము శ్రీ
మీఱఁగ దా ననుభవించు♦మిగుల కుమారా. ౧౦౨

టీ:—సారమతిన్ = బలమైన బుద్ధిచేత ఇటులన్ = పైజెప్పినరీతి; తిరిగెడి = ఆచరించెడి: పూరుషరత్నంబు=జనశ్రేష్ఠుఁడు;ధరపై, కీర్తి=యశ స్సును కోరినకోర్కె ఫలము = అన్నికోర్కెల సంపదలను: పొందుచున్ = అనుభవించుచు; మీద = పైలోకములో; శ్రీననుభవించుచుండు=శాశ్వత సుఖమును బొందును.

తా:—పైజెప్పినరీతి నాచరించువాడు యిహలోకములో సమస్త వాంఛలను బొంది పరమందు స్వర్గమును బొందును.

క॥ ఇల ప్రక్కి కులోద్భవుఁడ
ప్పల నరసింహాఖ్యుఁ డిట్టి పద్ధతుల ధరం
గల బాలురకెల్ల గుణం
బులుగలుగగ వెలయఁజెప్పె బుద్ధి కుమారా. ౧౦౩

టీ:—ప్రక్కికులోద్భవుఁడు = ప్రక్కి అను ఇంటిపేరుగలచోట పుట్టిన; అప్పలనరసింహాఖ్యుఁడు = అప్పలనరసింహామనుపేరు గలవాఁడు; ఇట్టిపద్ధతులు = పైవర్ణించిన నీతులు; ధరంగల బాలురకెల్లన్ = భూమిలో గల పిల్లవాండ్రకందఱకు; గుణంబులు వెలయంగ = మంచిగుణములు గలుగునట్లు; బుద్ధిజెప్పె; = మంచిని బోధించెను.

తా:—ప్రక్కి అప్పల నరసింహ మను కవి యీగ్రంథమును బాలురకు నీతినిచ్చి మంచివారిని జేయుటకు రచించెను.

క॥ పదునెనిమిదివందల యరు
వది యది క్రీస్తుశకమందు వరరౌద్రిని మే
లొదవ రచింపంబడె ని
య్యది బాలురకొఱకు పౌష మందు కుమారా. ౧౦౪

తా:—క్రీస్తుశకము 1860 సంవత్సరములో రౌద్రినామ సం॥ పుష్యమాసమున నీశతకము కవిచే వ్రాయఁబడెను.

శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము.

శ్రీ లలితాపరాభట్టారకాంబాదేవతార్పణమస్తు.